




















నోరూరించే మనసుదోచే మైమరపించే

**పార్లే పాపిన్స్**

పండ్ల రుచిగల పిప్పరమెంట్లు

5 పండ్ల సువాసనలలో—
రాస్ప్‌బెరీ, అనాస, నిమ్మ,
నారింజ, మోసంబి!

everest/981/pp-tl

పుష్టికరమైనది, ఎక్కువ మాంసకృత్తులు
వున్న మోడర్న్ పీనట్ బట్టర్‌ను
అనేక మధురమైన పద్ధతుల్లో
వుపయోగించవచ్చు, స్యాండ్ విచ్‌లు,
ప్యాన్‌కేక్‌లు, దోసెలు పరాఠాలమీద-
దాన్ని రాసి, తినండి, సూప్‌లు,
సేవరీలు, కేక్‌లుమరియు పులావులకు
కూడా దాన్ని చేర్చండి.




**ఆహార తయారీ పద్ధతి**

**పీనట్ బట్టర్ బిస్కట్లు**

2 కప్పుల పిండి, 4 చెంచాల
బేకింగ్‌పౌడర్, చెంచాడు ఉప్పు
బాగా కలపండి, వేళ్లచిగుళ్లతో నెయ్యిని.
మోడర్న్ పీనట్ బట్టర్‌ను చేర్చండి.
మెత్తటి ముద్దగా అయేందుకు చాలినంత
పాలనుమాత్రం పొయ్యండి, పీటమీద
పిండిని పిసకండి. 1/3″ మందంగా
మెత్తగా వొత్తండి. బిస్కట్ కట్టర్ లేదా
చాకుతో బిళ్లలగా కొయ్యండి,
వెన్నరాసినకాగితంమీద వుంచండి,
ఫోర్కుతో గుచ్చండి. (450° ఫా)వేడి
పొయ్యిలో 12-15 నిమషాల సేపు
పొడిగా వేయించండి. అయితే,
మోడర్న్ పీనట్ బట్టర్ వండేందుకు
వుపయోగించే పదార్థం కాదని మాత్రం
గుర్తుంచుకోండి.

ఉచితం ! ఆహార తయారీ కరపత్రం,
మీ ప్రతికోసం ఈదిగువ ఎడ్రస్‌కు
వ్రాయండి.

**మోడర్న్ బేకరీస్
(ఇండియా) లిమిటెడ్.**

(భారత ప్రభుత్వ వ్యవస్థ),
25బి, లోకల్ షాపింగ్ సెంటర్,
వసంత విహార్, న్యూ ఢిల్లీ 110057.

# మమ్మీ! మమ్మీ!
# మోడర్న్ పీనట్
# బట్టర్ బిస్కట్లు



U.MBI-5 TEL

# చందమామ

సంస్థాపకుడు : నాగిరెడ్డి
సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ నెల బేతాళకథ ["రాజయోగం"] వీరేపల్లి జయరాంరెడ్డి రచన.

ప్రపంచంలో మనిషిని డబ్బుతో కొలుస్తారు. ఒక మనిషి డబ్బు ఎలా సంపాదించాడు అన్నది ఎవరికీ పట్టదు. డబ్బు సంపాదించిన వాడే ప్రయోజకుడని లోకం అనుకుంటుంది. వాడికి అన్నిరకాల సత్కారాలూ లభిస్తాయి. అయితే కొందరు ప్రయోజకులు అయివుండి కూడా ఈ సత్కారాలను లక్ష్యపెట్టరు. వాళ్లే నిజమైన ప్రయోజకులు.

సంపుటి 56 మే '75 సంచిక 5




CHITRA



# మిత్రభేదం

## 23

నాగకుమారుడి కథ

రాజగృహం అనే నగరంలో దేవశర్మ అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. బిడ్డలు లేరని ఆయన భార్య, ఇతరుల పిల్లలను చూసి నప్పుడల్లా, గుండెలు పగిలేటట్టు ఏడ్చేది. బ్రాహ్మణుడికి భార్య అంటే చాలా ప్రేమ. ఒకనాడు ఆయన ఆమెతో, "ప్రేయసీ, నువ్వింక ఏడవటం మాను. నేను పుత్ర కామేష్టి చేస్తాను. అప్పుడు ఎవరో దేవుడు ప్రత్యక్షమై, శ్రవణానందంగా, 'ఓయీ, బ్రాహ్మణా! సౌందర్యంలో అందరినీ మించగలవాడూ, దీర్ఘాయువూ, ఎడతెగని అదృష్టం గలవాడూ అయిన కొడుకు నీకు కలుగుతాడు!' అంటాడు," అన్నాడు.

ఈ మాట విని బ్రాహ్మణుడి భార్య పరమానంద భరితురాలై, "తథాస్తు!" అన్నది.

బ్రాహ్మణుడు యథావిధిగా పుత్ర కామేష్టి చేశాడు. ఆయన భార్య గర్భవతి అయింది. ఆమె ప్రసవించి, కొడుకును కనటానికి మారుగా ఒక పామును కన్నది. ఆ పామును చూడగానే, పురుడు పోసిన అమ్మలక్కలు, "ఛీ, ఛీ! అవతల పారెయ్యండి," అన్నారు.

కాని ఆ ఇల్లాలు కడుపు తీపి కొద్దీ అంతపని చెయ్యక, ఆ పామును ఆప్యాయంగా దగ్గిరికి తీసుకుని, శ్రద్ధగా నీళ్లు పోసి, ఒక శుద్ధమైన కొత్త కుండలో ఉంచి రోజూ దానికి పాలూ, వెన్నా పెట్టుతూ వచ్చింది. పుష్టికరమైన ఈ అహారంతో పాము విపరీతంగా పెరిగింది.

కొద్ది సంవత్సరాలు గడిచాక, పొరుగింటివారి అబ్బాయికి పెళ్ళి జరిగింది. ఇది చూసి బ్రాహ్మణుడితో ఆయన

అట్ట చివరి బొమ్మ

భార్య, "మీకు నా చింత ఏమీ లేనేలేదు; మనవాడి పెళ్ళిమాటైనా ఆలోచించారు కారు," అని కళ్ళు ఒత్తుకున్నది.

దానికి బ్రాహ్మణుడు, "ప్రేయసీ, పాముకు ఎవరు పిల్లనిస్తారు ? పాతాళానికి పోయి, నాగకన్యను ఇయ్యమని వాసుకుని ప్రార్థించాలిసిందే గాని !" అన్నాడు.

ఈ మాటకు భార్య హృదయ విదారకంగా ఏడ్చేసరికి, ఆ బ్రాహ్మణుడు భార్య పట్లగల ప్రేమ కొద్దీ, తమ నాగకుమారుడికి వధువును వెతుకుతూ ప్రయాణమయాడు.



చాలా నెలల అనంతరం ఆయన చాలా దూరాన ఉన్న కుట్కుటం అనే నగరం చేరుకుని, అక్కడ ఉండే తన మిత్రుడూ, బంధువూ అయిన ఒక సంపన్నుడి ఇంటికి వెళ్ళాడు. ఆయన స్నానం చేసి, భోజనం చేసి, ఆ రాత్రి, అక్కడే నిద్రపోయాడు. మర్నాడు ఉదయం ఆయన తిరిగి ప్రయాణమవుతూండగా, ఆయన మిత్రుడు, "ఇక్కడికి ఏం పని మీద వచ్చావు ? ఎక్కడికి బయలుదేరుతున్నావు ?" అని అడిగాడు.

"నా కొడుక్కు వధువు కోసం చూస్తూ వచ్చాను," అన్నాడు బ్రాహ్మణుడు.

"అలా అయితే నా అందాల కూతుర్ని చేసుకో. నువూ, నేనూ, ఒకే స్థితి గల వాళ్ళం. ఒకే కులం వాళ్ళం. ఎరిగిన వాళ్ళం," అన్నాడు మిత్రుడు.

బ్రాహ్మణుడు ఇందుకు సంతోషంగా ఒప్పుకుని, వధువునూ, ఆమె తాలూకు దాసదాసీలనూ వెంట తీసుకుని, రాజగృహానికి తిరిగి వచ్చాడు.

పెళ్ళికూతురి అసాధారణ అందచందాలు చూసీ, ఆమెను పాముకిచ్చి పెళ్ళి చేస్తున్నారని వినీ జనం తండోపతండాలుగా పోగయారు. ఆ పిల్లను చూడగానే వాళ్ళకు జాలి కలిగింది. వాళ్ళు ఆమె పరివారంతో, "ధర్మం ప్రకారం నడుచుకునే సజ్జనులమని చెప్పుకునే వాళ్ళు ఎక్కడన్నా రత్నంలాంటి

ఈ పిల్లను వెధవ పాముకు ఇచ్చి పెళ్ళి చెయ్యటం కద్దా ?'' అన్నారు.

దాసదాసీలు ఈ దారుణ వార్తను వెంటనే వధువుకు చెప్పారు.

చుట్టూ మూగిన జనం ఆ పిల్లను గురించి బాధపడ్డారు. వారిలో పెద్దలు, ''ఈ పిల్లను బలాత్కారంగా విడిపించి, తన ఇంట కూడా స్వేచ్ఛగా తిరగలేని ఆ దిక్కుమాలిన పాముకు భార్య కాకుండా చూడండి,'' అని అరిచారు.

అంతా విని ఆ పిల్ల, ''ఇంక చాలించండి! రాజులు తాము జారీ చేసిన అజ్ఞలను ఉపసంహరించుకోరనీ, మంచి వాళ్లు తాము చేసిన వాగ్దానాలను వెనక్కు తీసుకోరనీ, కన్యను దానం చెయ్యటమనేది ఒక్కసారే జరుగుతుందనీ పెద్దలు చెబుతారు. దైవనిర్ణయం జరిగి తీరుతుంది. పుష్పకం చావును దేవతలే నివారించలేకపోయారు,'' అన్నది.

''ఏమిటా పుష్పకం కథ?'' అని చుటూ మూగిన వాళ్ళు అడిగారు.

ఆ వధువు వారికి ఆ కథ ఇలా చెప్పింది:

పుష్పకం కథ

ఇంద్రుడి వద్ద అనేక శాస్త్రాలలో ప్రావీణ్యం గల ఒక చిలుక ఉండేది. దాని పేరు పుష్పకం. ఒకసారి అది ఇంద్రుడి చేతిలో కూర్చుని కబుర్లాడుతూ, యముణ్ణి చూసి పారిపోయింది. ఎందుకలా చేశావని దేవతలు పుష్పకాన్ని అడిగారు. ''అన్ని ప్రాణులకూ హాని కలిగించే వాణ్ణి చూసి పారిపోక ఏం చెయ్యను?'' అన్నది పుష్పకం.

అప్పుడు దేవతలు యముడితో, ''పుష్పకాన్ని చంపకు,'' అన్నారు.

''నేను కాలుడి బంటును. నా చేతిలో ఏమీలేదు. మీరు వెళ్ళి కాలుణ్ణి అడగండి,'' అన్నాడు యముడు.

వాళ్ళు కాలుణ్ణి అడిగితే, మృత్యువును అడగమన్నాడు. దేవతలు మృత్యువును అడిగారు. కాని మృత్యువును చూడగానే పుష్పకం ప్రాణాలు వదిలింది.





## 11

[రాకసుడి భూగృహంలో తమ వద్ద వున్న భస్మాలూ, అంజనాలూ పనిచెయ్యవని కవల సోదరులు తెలుసుకున్నారు. రాక్షసుడు, వాళ్ళ మాయతువ్వాలూ అవీ తీసుకుని భోజనం పెట్టి, తరవాత వాళ్ళను శిలాప్రతిమలుగా మార్చాడు. దానశీల మహారాజూ, ఆయన రాణీ తమ కవలకుమార్తెలు దొరకనందుకు విచారంలో మునిగిపోయారు. తరవాత—]

రాకసుడి చేతిలో కవలసోదరులు చిక్కిపోవటమూ, ఆ తర్వాత వాడి తమ్ముడు వాళ్ళను తన వెంట తీసుకుపోవటమూ, యిదంతా కొలనులో హంసల రూపంలో వున్న రాకుమార్తెలు చూస్తూనే వున్నారు. రాకసులిద్దరూ గమనించని విషయం కూడా వాళ్ళు చూశారు. అది ఏమిటీ అంటే, ఉదయనుడు డబ్బీ తీసి తెల్ల భస్మం మీద చల్లుకోబోయేసరికల్లా, రాకసుడు అక్కడికి రావటం జరిగింది. ఆ తొందరపాటులో భస్మం చల్లుకోలేకపోగా, డబ్బీ కాస్తా క్రిందపడిపోయింది. దాన్ని తిరిగి తీసుకుందామంటే వీలుకాక కవలసోదరులు దాన్ని వదిలేశారు.

రాకసులు ఎవరి దారిన వారు వెళ్ళిపోగానే, రాకుమార్తెలు కొలనులో నుంచి బైటికి వచ్చి, ఆ డబ్బీ కోసం వెతికారు. కాని, అది కనుపించలేదు.



రాజకుమార్తెలు ఆశ్చర్యపోయారు. "ఇదేమిటి, చిత్రంగా వున్నదే! ఆ డబ్బీని మనం ముగ్గురం చూస్తూనే వుంటిమి కదా? ఎలా మాయమయి వుంటుంది? ఇక్కడే ఎక్కడో వుండాలి. వెతుకుదాం రండి." అన్నది సుహాసిని.

అలాగే వాళ్లు ముగ్గురూ చుట్టుప్రక్కల వెతుకుతూపోగా, కొలనుకు చాలా దూరాన ఒక చోట డబ్బీ కనుపించింది. ఇక వాళ్లు డబ్బీని ఎక్కడ దాచటమా అని ఆలోచించి, ఆలోచించి, చివరకు దానిని అందుబాటులో దాచటం మంచిదనుకుని, కొలను ఒడ్డునే ఒక చోట చిన్న గుంటత్రవ్వి దానిలో కప్పెట్టారు.

ఆ క్షణం మొదలుకొని కవల సోదరులను రక్షించే మార్గం ఏమిటా అని ఆలోచించసాగారు. చివరకు ఒకనాడు సుకేశిని, "నాకు ఒక ఉపాయం తోచింది, చెప్పనా?" అన్నది.

ఇది విని సుభాషిణీ, సుహాసినీ, "ఏమిటా ఉపాయం?" అని ఉత్సాహంతో అడిగారు.

అప్పుడు సుకేశిని, "ఎలాగైనా రాక్షసుణ్ణి అక్కడ నుంచి కదిపి యివతలకు తీసుకురావాలి. ఇది ఒకలా చెయ్యవచ్చు: మనమందరమూ కలిసి వాడి దగ్గిరికి పోయి, నృత్యం చేసి చూపుతాం అని నమ్మించుదాం. ఇలా మనలో వెళ్ళదలిచిన ఎవరో ఒకరు కొంత మంత్రజలాన్ని తీసుకువెళ్ళి, ఆ కుర్రవాళ్ల శిలాప్రతిమల మీద చల్లి, వాళ్ళకి మామూలు స్వరూపాలు తెప్పించాలి. రాక్షసుడి కంట పడకుండా ఒకళ్ళం అక్కడే వుండిపోయి, ఈ పని చెయ్యవచ్చు. తర్వాత ఏమి చెయ్యటమా అనేది కుర్రవాళ్ళనే సంప్రతించవచ్చు." అన్నది.

ఇది విని సుహాసిని, "వాడేం సామాన్యుడా మన టోపీలో పడటానికి. ఒకవేళ మనం వాణ్ణి టోపీ వేసి, అక్కణ్ణుంచి యివతలకు తీసుకురాగలిగినా వాడి భవనంలో వుండి, వాడి

కన్ను కప్పి యింత చెయ్యటం మాటలా? మనం కూడా చిక్కిపోయామా అంటే మన సంగతీ ఆ కుర్రవాళ్ల సంగతీ, మన వాళ్ళకు తెలిసే అవకాశం కాస్తా పోతుందే. ఈ ఉపాయమేమో బాగానే వుంది. కాని ఆచరణమటుకు అసాధ్య మనిపిస్తుంది," అన్నది.

అందుకు సుకేశిని, "సరేలే, ధైర్యం లేకపోతే ఎవరూ ఏ పనీ చెయ్యలేరు. అపాయంలో చిక్కుకుంటామని చెప్పి, ఆ కుర్రవాళ్ళను రక్షించకుండా వుండ గలమా?" అన్నది. సుహాసినీ, సుభాషిణీ ఔనౌనన్నారు.



మర్నాడు కొలనులో వున్న హంస లన్నీ ఒడ్డుకు వచ్చినై. రావటంతోటే వాటికి మనుష్యాకారాలు వచ్చినై. కవల రాజకుమార్తెల మాదిరిగానే వాళ్ళంతా, రాక్షసుడి చేతిలో చిక్కిపోయినవాళ్ళే. వాళ్ళల్లో ఆడపిల్లలు, మగపిల్లలూ వున్నారు.

మగపిల్లలందరినీ కొలనులోకి తిరిగి వెళ్ళిపొమ్మన్నది. సుహాసిని. అలాగే వాళ్ళు వెళ్ళిపోయారు, తక్కిన వాళ్లంతా ఆడపిల్లలే. వాళ్ళంతా చేరి ఆ తోటలో పువ్వులు కోసుకుని పాడుకుంటూ, ఉత్సా హంగా గెంతుతూ రాక్షసుడి భవనం వైపుకు రాసాగారు.

ఈ సందడి చెవిని పడేసరికి రాక్షసుడే వాళ్ళకు ఎదురు వచ్చి, "ఇదేమిటి? ఇలా బయలుదేరారెక్కడికి? నా మీద దాడి చేద్దామనా?" అన్నాడు నవ్వుతూ.

అందరిలోకి ముందున వున్న సుకేశిని, "నీ అంత వాడిపైన దాడి చెయ్యటం ఎవరి తరం? కొత్తగా చిక్కిన ముగ్గురు కుర్రవాళ్ళూ ఏమైపోయారో చూతామని వచ్చాం," అన్నది.

అందుకు రాక్షసుడు పగలబడి నవ్వుతూ, "ఏమవుతారు? అంతకు ముందు వచ్చిన వాళ్ళు ఏమయ్యారో, వీళ్ళూ అంతే. ఏం, చూస్తారా?" అంటూ భవనంలోకి వెంటబెట్టుకు వెళ్ళి కవల



సోదరుల శిలాప్రతిమలు వరసన ఒక్కొక్కటిగా చూపాడు. వాటిని చూస్తూ సుకేశిని, "బాగానే వున్నది, నీ ఉద్యోగం! కాని, నా సందేహం ఒకటి తీర్చు. ఇంత మందిమి కలిసి మెలిసి వుంటున్నా, ఈ నిర్బంధంతో ప్రాణం విసిగిపోయి, మీ అన్న చేయదలుచుకున్న బలి త్వరగా అయిపోతే బాగుండునే అనిపిస్తున్నది, మాకు. అటువంటిది నువ్వు ఒక్కడివీ, ఈ శిలాప్రతిమల మధ్య విసుగూ, విరామంలేకుండా ఏళ్ళ తరబడి ఎలా కాపలా కాస్తున్నావయ్యా? ఎప్పుడైనా అలా స్వేచ్ఛగా ఎక్కడికన్నా పోవాలని వుండదా?" అని నిబ్బరంగా అడిగింది.

అందుకు రాక్షసుడు, "నాకు మాత్రం విసుగెత్తటం లేదనుకున్నారా? కాని, ఏం చేయటం? ఈ చోటు విడిచి వెళ్లానే, మిమ్మల్ని బలియివ్వటానికి ముందు, నన్నే హతమారుస్తాడు మా అన్న. ఏమీ తోచక నేనూ సతమతమవుతూనే వున్నాను." అని మనసులో బాధ వెలిబుచ్చాడు.

వెంటనే సుకేశిని అందుకుని, "ఎంత సేపనియిలా? పోనీ కాస్సేపు మాతోపాటు వచ్చి కులాసాగా వుండకూడదా? నీకు ఆనందం కలిగేటట్టు ఆటలాడతాం, పాటలు పాడతాం. మాకూ కొంత ఊసుపోతుంది. రా, చూదుగాని తమాషా." అని రాక్షసుణ్ణి ఉత్సాహపరిచింది.

"అమ్మయ్యో, ఈ భవనం విడిచి వచ్చేయటమే! ఏనుగంత వాణ్ణి నేను కాపలా కాస్తుండగానే, నా కళ్ళల్లో దుమ్ము కొట్టి, ఈ కుర్రవాళ్లు ఎలాగో ప్రవేశించారే. భవనం వదిలితే మరేమైనా వుందా," అన్నాడు రాక్షసుడు.

"ఆఁ, నీ భ్రమగాని యిక్కడికి ఎవరు రాగలుగుతారు? వచ్చారే అనుకో, నీ చేతిలో చిక్కక ఎక్కడికి పోగలరు? పోనీ, మాలో ఒకరు నీ బదులు కాపలా కాస్తూ వుంటారు. కాస్సేపు కులాసాగా కాలక్షేపం చేసి, తిరిగి నీ ఉద్యోగానికి

నువ్వుపోదువు గాని,'' అన్నది సుకేశిని. ఈ మాట రాక్షసుడికి నచ్చింది.

''మరైతే నా బదులు కాపలా కాసేది ఎవరు ?'' అని అడిగాడు వాడు.

సుకేశిని, సుహాసిని వైపు అట్టె చూసి, ''మరెవరోనా ? మా అక్క వున్నది,'' అన్నది. ఆ ప్రకారమే సుహాసినిని భవనంలో వదిలి, వాళ్ళు కొలను వైపుకు బయలుదేరారు.

కొలను ఒడ్డున వాళ్ళు, రాక్షసుణ్ణి మధ్య కూర్చోపెట్టి, చుట్టూ చేరి నృత్యం చెయ్యసాగారు. వాళ్ళ ఆట పాటలకు రాక్షసుడు తన్మయుడై, ''రోజూ ఇలా ఆట పాటలతో కాలక్షేపం చేస్తే బాగుండునే!'' అన్నాడు.

రోజూ ఎవరో ఒకరు రాక్షసుడి బదులు కాపలా కాస్తుండటమూ, వాడు ఆట పాటలకు ఆనందించటమూ అలవాటైంది.

నాలుగు రోజులు గడిచేసరికి, అంతకు మునుపు భవనం విడిచి రావటానికి భయపడే రాక్షసుడు, ఇప్పుడు తనంతట తనే వచ్చి, రాకుమార్తెలను రమ్మనటం మొదలుపెట్టాడు. ఇది చూసి సుకేశిని తన పాచిక పారింది కదా అని సంతోషించింది.

ఇంతవరకూ బాగానే వుంది. పోతే, కవలల శిలా ప్రతిమలను మంత్ర జలంతో మామూలు మనుష్యులుగా మార్చివేయాలి. జలం తీసుకు రావాలంటే, ఏదైనా ఉపకరణం వుండాలి.






షోనీ పాత్ర ఎక్కడైనా సంపాదించి తెచ్చి, దానితో జలం తీసుకు వద్దామా అంటే, ఉన్న పాటున రాక్షసుడికి పట్టుబడిపోతా రేమో! మరేమిటి గత్యంతరం? మళ్ళీ ఆలోచన పడింది. ఐతే—సుకేశిని వంటి తెలివిమంతురాలికి ఇదొక ఘనకార్యమా?

మర్నాడు రాక్షసుణ్ణి పిలుచుకు రావ టానికి వెళ్ళేముందు, సుకేశిని తోటలోకి పోయి మంత్రజలంతో తన చీర చెంగు ఒకటి బాగా తడుపుకొన్నది. రెండో చివర కొలను నీటితో తడుపుకొన్నది.

ఇలా తయారైన సుకేశిని రాక్షసుడి దగ్గరకు వెళ్ళి, "ఇవాళ కాపలా కాయటం నా వంతు. నేను లేకుండా మా వాళ్ళ ఆట పాటలు నీకు ఎలా నచ్చినయ్యో వచ్చి నాకు చెప్పాలి సుమా!" అన్నది.

"అలాగే చెపుతాను!" అంటూ రాక్షసుడు క్షణమైనా అక్కడ నిలవకుండా కొలనుకి బయలుదేరాడు. వాడు వస్తుండటం చూచి కొలనులోని రాకుమార్తెలు వెంటనే ఆట పాటలలో మునిగిపోయారు.

రాక్షసుడు భవనం విడిచి వెళ్ళిన మరుక్షణమే సుకేశిని, కవలసోదరుల శిలాప్రతిమల పైన చీరచెంగుతో తెచ్చిన నీటిని పిండింది. వెంటనే వాళ్ళకు మామూలు స్వరూపాలు వచ్చేసినై. వాళ్లు అమితాశ్చర్యంతో, "ఇదేమిటి? ఇక్కడికెలా వచ్చావ్? ఆ రాక్షసుడేమయ్యాడు?" అని అడిగారు.

అప్పుడు సుకేశిని తాను పన్నిన పన్నాగం విప్పి చెప్పి, "వాడు ఆట పాటలలో పరవశుడైవున్న సమయం కని పెట్టి, పొంచి వుండి హతమార్చేయాలి. ఆలోచించండి ఉపాయం," అని కవల సోదరులను వేగిరపెట్టింది.

"ఎలా సాధ్యం? భస్మం కూడా పోగొట్టుకున్నామే," అన్నాడు ఉదయనుడు.

భస్మం సంగతి సుకేశిని మరిచే పోయింది. ఉదయనుడు యీ సంగతి

గుర్తు తేగానే. ''అన్నట్టు అవును. ఒకలా చేద్దాం. ఇవ్వాళ్టికి మిమ్మల్ని శిలాప్రతిమలుగా చేసిపోతాను. రేపు వచ్చేటప్పుడు భస్మం కూడా తెస్తాను,'' అన్నది.

ఇందుకు కవలసోదరులు చాలా సంతోషించారు. వెంటనే సుకేశిని కొలను నీటితో తడిపిన చీర చెంగు పిండి, వాళ్ల నోళ్ళల్లో పోసింది. యథాప్రకారం శిలా ప్రతిమలుగా మారిపోయారు.



ఇంతలో రాక్షసుడు అక్కడికి వచ్చేసి, ''ఎలాగైనా నువ్వు వుంటేనే నయం! ఇవాళ అంతా చప్ప చప్పగా వుంది,'' అన్నాడు సుకేశినితో.

''నిజంగానా? ఎగతాళి చేస్తున్నావ్! ఐతే రేపు నేను సభలో వుంటాలే. మా అక్కనే యిక్కడికి కాపలా పంపుదాం,'' అంటూ తిరిగి కొలను వద్దకు వచ్చి చేరుకున్నది.

తర్వాత రాకుమార్తెలు ముగ్గురూ కలిసి, భస్మాన్ని తీసుకురావటానికి వెళ్లి, గుంట తవ్వి చూడగా డబ్బీ కనబడక పాయె! ఏమి చెయ్యటానికీ వాళ్ళకి పాలుపోయింది కాదు. అప్పుడు సుకేశిని, ''విచారిస్తూ కూర్చుంటే ప్రయోజనం ఏమున్నది? ఇవాళ భవనం కాపలాకు నువ్వు వెళ్ళు. ఇలా యిలా జరిగిందని కుర్రవాళ్ళకు తెలియజెప్పు. ఆ పైన వాళ్ళు చెప్పినట్టు చేదాం,'' అని సుభాషిణిని పంపింది.

సుభాషిణి కూడా మంత్రజలంతోనూ, కొలను జలంతోనూ చీర చెంగు తడుపుకొని భవనానికి వెళ్లి, రాక్షసుణ్ణి విడుదల చేసి పంపింది. వాడు వెళ్ళిపోగానే సుభాషిణి చీరె చెంగు నుండి నీటి బొట్లు శిలాప్రతిమలపైన వేసింది. కాని పాపం, ఆ తొందరలో సుభాషిణి మంత్రజలంతో తడిసిన చెంగు పిండడానికి బదులు, కొలను నీటితో తడిసిన చెంగు పిండింది. అందుచేత శిలాప్రతిమలకు మామూలు స్వరూపాలు రాలేదు. ''అరెరె! ఎంత పొరపాటు జరిగింది!'' అనుకుంటూ



15

సుభాషిణి, ఈసారి మంత్రజలాన్ని పిండింది. వెంటనే సోదరులు అసలు రూపాలతో లేచారు.

అప్పుడు సుభాషిణి, భస్మం మాయం కావటం చెప్పి, జలంవాడటంలో తను చేసిన ప్రమాదం కూడా వెల్లడించింది.

అందుకు ఉదయనుడు, "ఇదంతా చూడగా, మనం తలపెట్టిన పని ఏదీ జయప్రదం కాదని తోస్తున్నది. లేకపోతే అడుగడుగునా ఈ అవాంతరాలేమిటి?" అన్నాడు నిస్పృహతో.

మధ్యలో నిశీధుడు అడ్డుపడి, "జయప్రదం కాకపోవటమేమిటి? దేవుడు మనల్ని పరీక్షిస్తున్నాడు, అంతే. ఇంత మాత్రానికే జడిసిపోవటమా?" అన్నాడు.

"సరే, రాక్షసుడు తిరిగి భవనం చేరుకొనేసరికల్లా మనం తప్పించుకుని పోవాలి. లేదా ...." అని ఏమో చెప్ప బోయాడు ఉదయనుడు.

సుభాషిణి అతడి మాటలకు అడ్డు తగిలి, "నాకు ఒక ఉపాయం తోస్తున్నది. ఇక్కడవుండే ఆ ప్రతిమలలో మూడింటిని తెచ్చి, మీ స్థానాల్లో వుంచుదాం. వాడు ఏనుగంత మనిషే గాని, బుర్ర మాత్రం పర్తి మట్టి బుర్ర. కాబట్టి ప్రతిమలు మార్చిన సంగతి వాడు చచ్చినా కని పెట్టలేడు. మీరు బైట, ఆ పొదచాటున దాక్కోండి. వాడు భవనం లోపలికి పోగానే మీరు, మా దగ్గరికి వచ్చేయండి. చూదాం తర్వాత సంగతి," అన్నది.

సుభాషిణి చెప్పిన యీ ఉపాయం బాగుందంటె బాగుందన్నారు, కవల సోదరులు. ఇంకా అలస్యం ఎందుకని, ఆ వెంటనే నలుగురూ చేరి మూడు శిలా ప్రతిమల్ని తెచ్చి, తమ స్థానంలో వుంచి, బయటకు వచ్చి ఒక పొదచాటున నక్కి కూర్చున్నారు.

కొంచెం సేపటికల్లా రాక్షసుడు తిరిగి వచ్చి, సుభాషిణిని విడుదల చేశాడు. వెంటనే సుభాషిణి, కవల సోదరులున్న చోటుకు వెళ్ళి, వాళ్ళతో సహా కొలను చేరుకున్నది. —(ఇంకా వుంది)






# రాజయోగం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, రాసి పెట్టినదాన్ని తప్పించటానికి చేసే ప్రయత్నం ఎంత నిరుపయోగమో, దాన్ని నిజం చెయ్యటానికి చేసే ప్రయత్నం కూడా అంత నిరర్థకమే. అందుకు నిదర్శనంగా నీ కొక కథ చెబుతాను. నీ లాగా మానవయత్నం చెయ్యగలవాడు మరొకడు ఉండబోడు గనక, శ్రమ తెలియకుండా శ్రద్ధగా విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం చందనపురాన్ని నందనవర్మ అనే రాజు పాలిస్తూ ఉండేవాడు. ఆయనకు లేక లేక ఒక కొడుకు కలిగాడు. రాజు తన ఆస్థానజ్యోతిష్కుణ్ణి పిలిచి

## బేతాళ కథలు



రాజకుమారుడి జాతక చక్రం వేసి పట్టుకు రమ్మన్నాడు.

జ్యోతిష్కుడు ఇంటికి చేరేసరికి అయన భార్య కూడా ఒక కొడుకును కన్నది. జ్యోతిష్కుడు రాజు కొడుకు జాతక చక్రంతో బాటు తన కొడుకు జాతక చక్రం కూడా వేసి, రెంటినీ చాలా సేపు పరిశీలించి, ఆశ్చర్యపోయాడు.

ఎందుకంటే, తన కొడుక్కు ఇరవయ్యో యేట రాజయోగం ఉన్నది. అదే వయసులో రాజకుమారుడికి రెండు ప్రాణ గండాలున్నాయి!

మొట్టమొదట జ్యోతిష్కుడు రాజుతో ఉన్న విషయం ఉన్నట్టుగా, చెప్పేద్దామనుకున్నాడు. కాని ఒక్క క్షణం ఆలోచించిన మీదట నిజం చెప్పటం మంచిది కాదని తోచింది. తన కొడుక్కు పట్టే రాజయోగానికీ, రాజకుమారుడి ప్రాణగండానికీ సంబంధం ఉన్నది. ఈ సంగతి తెలిసి రాజు తన కొడుక్కు గ్రహశాంతులు చేసి దోషం పోగొట్టుకో వచ్చు; లేదా, ఇరవై యేళ్ళు రాకముందే పట్టాభిషేకం చెయ్యవచ్చు!

ఇలా ఆలోచించి జ్యోతిష్కుడు రాజుతో అబద్ధం చెప్పటానికే నిశ్చయించుకుని, "మహారాజా, యువరాజు జాతకం దివ్యంగా ఉన్నది. అయితే అతనికి ఇరవైయ్యేళ్ళు వెళ్ళితేనేగాని రాజ్యాభిషేకం చెయ్యకండి. అందువల్ల అరిష్టాలు కలగవచ్చు," అన్నాడు.

రాజు కొడుక్కు ఆనందవర్మ అనీ, జ్యోతిష్కుడి కొడుక్కు సుందరసేనుడు అని పేర్లు పెట్టారు. ఇద్దరూ ఒక గురువు వద్దనే విద్యాభ్యాసం చేసి, పెరిగి పెద్ద వాళ్ళు అయారు. ఇద్దరికీ ఇరవయ్యో ఏడు ప్రవేశించింది.

ఒకనాడు జ్యోతిష్కుడి కొడుకు సుందరసేనుడు తన తండ్రితో, "నాకు జ్యోతిష్యంలో ఇంకా పాండిత్యం సంపాదించాలని ఉన్నది. అందుకని కొన్నాళ్ళు దేశాటన చేసి వస్తాను," అన్నాడు.

'' నువు ఆరుమాసాలలో తిరిగి రావాలి. అలా అయితేనే వెళ్లు. లేకపోతే వెళ్లకు,'' అన్నాడు తండ్రి.

సుందరసేనుడు అందుకు సమ్మతించి, ఇంటి నుంచి వెళ్ళిపోయాడు.

ఆరు నెలలు గడిచాయి, కాని సుందరసేనుడు తిరిగి రాలేదు. జ్యోతిష్కుడు ఆందోళనపడిపోయాడు. మరొక అయిదు నెలలు గడిచాయి. అప్పటికీ సుందరసేనుడు తిరిగి రాలేదు. రాజుకొడుకైన ఆనందవర్మకు ఎలాటి గండమూ కలగ లేదు. పైపెచ్చు, మరి రెండు నెలలకు తన కుమారుడికి పట్టాభిషేకం జరుపుతున్నట్టు నందనవర్మ ప్రకటించాడు.

జ్యోతిష్కుడి ఆందోళన మరింత అయింది. తన జోస్యం తప్పు కావటానికి వీల్లేదు. ఆనందవర్మ కొద్ది రోజులలో చచ్చితీరాలి, తన కొడుకు సుందరసేనుడు రాజు అయితీరాలి!

తన జోస్యం నిజం చెయ్యటానికి జ్యోతిష్కుడు తానే పూనుకున్నాడు. అందుకు ఒక ఆలోచన కూడా ఆయన చేశాడు.

యువరాజు సాయంకాలం పూట ఉద్యానవనానికి వెళ్ళి, ఒక చెట్టు కింది తిన్నె మీద కూర్చుంటాడు. జ్యోతిష్కుడు ఒక పెద్ద రాయికి తాడు కట్టి, దాన్ని



చెట్టు ఆకుగుబురు చాటున ఉండే టట్టుగా అమర్చి, ఆ తాడు రెండవ కొసను దూరంగా ఉన్న మరొక చెట్టుకి కట్టి ఉంచాడు.

సాయంకాలం పూట ఆనందవర్మ వచ్చి, చెట్టు కింది తిన్నె మీద, రాయికి సూటిగా కింద కూర్చున్నాడు. ఆ సమయంలో జ్యోతిష్కుడు రాయికి కట్టిన తాడు రెండో చివర విప్పి, దూరంగా తొలగిపోయాడు.

అదే క్షణంలో యువరాజు తిన్నెపై నుంచి లేచి, ఎదురుగా కనిపించిన అందమైన పువ్వును ఆఘ్రాణించ బోయాడు. అతను లేచిన మరుక్షణమే,



అతను కూర్చుని ఉండిన చోట దభీమని పెద్ద రాయి పడింది.

ఆనందవర్మ అదిరిపడి వెనక్కు తిరిగి చూశాడు. తిన్నెమీద పెద్ద రాయీ, దానికి కట్టి ఉన్న తాడూ కనిపించాయి. తనను హత్య చేయటానికి ఎవరో ప్రయత్నించి నట్టు అతను గ్రహించాడు. ఆ సంగతి ఎవరికీ చెప్పలేదు.

తన ప్రయత్నం విఫలం అయిందని తెలిసి జ్యోతిష్కుడికి మతిపోయింది. ఆయన వెర్రెత్తిపోయి, ఆ రాత్రి ఒక కత్తి తీసుకుని, సరాసరి యువరాజు శయనమందిరానికి వెళ్ళాడు. ఆ సమ యంలో, చిత్రంగా, కావలి వాళ్లందరూ గాఢ నిద్రలో ఉన్నారు. అది తన అదృష్ట మనుకుని, జ్యోతిష్కుడు లోపల ప్రవే శించి, నిద్రలో ఉన్నట్టు కనిపిస్తున్న ఆనందవర్మను పొడవబోయాడు. అంతలో ఆనందవర్మ చివాలున లేచి, జ్యోతిష్కుడి చెయ్యి పట్టుకున్నాడు.

ఆనందవర్మ జ్యోతిష్కుణ్ణి గుర్తించి ఆశ్చర్యపడుతూ, "ఈ సాయంకాలం నన్ను చంపటానికి ప్రయత్నించినది నువే నన్న మాట! హంతకుణ్ణి పట్టుకోవటానికే నేనూ, నా కావలి వాళ్లూ నిద్ర నటించాం. ఇంతకూ, నా మీద నీ కెందుకంత పగ?" అని అడిగాడు.

జ్యోతిష్కుడు వణికిపోతూ, సంగతి అంతా యువరాజుకు చెప్పాడు.

అంతా విని ఆనందవర్మ నవ్వి, "నీ జోస్యం నిజమయింది. నాకు రెండు ప్రాణగండాలూ నీ ద్వారానే కలిగాయి. అయినా, నీ కొడుకు ఈ రాజ్యానికే రాజు కావాలని ఎందుకు అనుకున్నావు? మరో రాజ్యానికి రాజు కాగూడదా?" అన్నాడు.

అతను అన్నట్టే అయింది కూడాను.

దేశాటనకు పోయిన సుందరసేనుడు ఒక దేశపురాజును రాజద్రోహుల మురా నుంచి కాపాడాడు. ఆ రాజు చాలా వృద్ధుడూ, పిల్లలు లేనివాడు కావటం చేత, సుందరసేనుడికి తానే స్వయంగా

రాజ్యాభిషేకం చేశాడు. ఈ వార్త త్వర లోనే చందనపురానికి తెలియవచ్చింది. సుందరసేనుడు తండ్రికి మాట ఇచ్చిన ప్రకారం తిరిగి రాకపోవటానికి కూడా ఇదే కారణం.

ఆనందవర్మ జ్యోతిష్కుడి పైన ఎలాంటి చర్యా తీసుకోకపోగా, ఆయనను తన కొడుకు వద్దకు వెళ్ళవద్దనీ, తన ఆస్థానంలోనే ఉండమనీ కోరాడు. కాని జ్యోతిష్కుడికే ముఖం చెల్లక, తన కొడుకు పాలించే దేశానికి సకుటుంబంగా తరలిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా! తనను చంపటానికి రెండుసార్లు ప్రయత్నించిన జ్యోతిష్కుణ్ణి ఆనందవర్మ ఎందుకు క్షమించాడు? దైవయత్నానికి మానవయత్నం తోడు అంటారు గదా, జ్యోతిష్కుడి యత్నం ఎందుకు విఫలమయింది? అతను తప్పుడు ప్రయత్నం చేసినా దైవనిర్ణయమే అమలు జరిగింది గనక మానవయత్నం వ్యర్థమేనా? ఈ సందేహాలకు సమాధానాలు తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల బద్దలవుతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "జ్యోతిష్కుడి జోస్యం అమోఘమని ఆనందవర్మ గుర్తించి అతన్ని తన ఆస్థానంలోనే ఉండమన్నాడు. జ్యోతిష్కుడు అపోహపడ్డాడే గాని ఆనందవర్మపై అతనికి వ్యక్తిగతమైన పగలేదు. అదీగాక అతని హత్యాప్రయత్నాలు విఫలమయాయి. అందుచేత ఆనందవర్మ జ్యోతిష్కుణ్ణి క్షమించాడు. అతను చాలా ఆత్మనిగ్రహం కలవాడనటానికి సందేహంలేదు. పోతే, జ్యోతిష్కుడి మానవయత్నం, ఎంత అపోహతో కూడుకున్నదైనా, వ్యర్థమయిందనటానికి వీలులేదు; ఆ ప్రయత్నం ఫలితంగానే ఆనందవర్మకు రాసి పెట్టి ఉన్న గండాలు కలిగాయి," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# మంత్రి తెలివి

పులిరాజు పరమమూర్ఖుడు. మంత్రి చాలా తెలివైనవాడు.

ఒకసారి రాజ్యంలో తీవ్రమైన కరువు వచ్చింది. ప్రజలలో ఆకలి చావులు ఆరంభమయాయి. వాళ్ళు రాజును ఆయన ధాన్యాగారాల నుంచి ధాన్యం అప్పుగానైనా ఇప్పించమని కోరారు. మంత్రి కూడా రాజుకు అదే సలహా ఇచ్చాడు.

మూర్ఖుడైన రాజు అందుకు ఒప్పుకోలేదు. తన ధాన్యాగారాన్ని ప్రజలు కొల్లగొట్టుతారని ఆయన తన మంత్రితో, "మన ధాన్యాన్ని ద్వీపాంతరాలకు పంపి అమ్మించెయ్యండి," అన్నాడు.

మంత్రి వెంటనే ధాన్యాన్ని సముద్రతీరానికి తరలించి, కొద్ది రోజుల అనంతరం రాజుతో, "మహారాజా, మన ధాన్యపు ఓడలు సముద్రంలో మునిగిపోయాయి," అన్నాడు.

"ఏం చేస్తాం? ధాన్యం కోసం అలమటించే మన ప్రజల్ని సముద్రంలో దిగి ఆ ధాన్యాన్ని తెచ్చుకోమనండి," అన్నాడు రాజు.

సముద్రతీరాన ఉంచిన ధాన్యాన్ని మంత్రి ప్రజలకు పంచాడు.

—చెల్లూరి సీతారాజేశ్వరరావు.





# ప్రయోజకుడు

ఒక గ్రామంలో ఒక విధవరాలు ఉండేది. ఆమెకు ఇద్దరు కొడుకులు ఉండేవారు. వాళ్లు చిన్నపిల్లలుగా ఉండగానే తల్లి మంచాన పడింది. ఆ సంగతి తెలిసి దూర గ్రామంలో వున్న ఆమె అన్న సోమయ్య చూడవచ్చాడు. విధవరాలు తన కొడుకుల నిద్దరినీ అన్నకు అప్పగించి తాను చనిపోయింది.

సోమయ్య వాళ్లిద్దరినీ తన వెంట తీసుకుపోయి, శ్రద్ధగా పెంచి పెద్ద చేశాడు. అయితే వాళ్లు ఎందులోనూ రాణించలేదు. వాళ్ళు ఎలా బతుకుతారో సోమయ్యకు అర్థం కాలేదు.

సోమయ్యకు మీనాక్షి అనే కూతురు ఉన్నది. ఆమె చక్కని పిల్ల. ఆ పిల్లను చేసుకోవాలని అన్నదమ్ము లిద్దరికీ ఉండేది. ఆ మాట వాళ్లు సోమయ్యతో అనేశారు.

సోమయ్య వాళ్ళతో, "మీ ఇద్దరికి ఏ విధమైన సామర్థ్యమూలేదు. మీనాక్షిని మీలో ఒకడికి ఇచ్చి చెయ్యడమంటే దాని గొంతు కొయ్యడమే. అయినా దాని పెళ్లికి తొందర ఏమీలేదు. మీకు నాలు గేళ్ల గడువు ఇస్తాను. ఈ లోపల మీరు ప్రయోజకులు కాండి. మీలో ఎవరు ప్రయోజకుడైతే వాడికి మీనాక్షిని ఇచ్చి పెళ్ళి చేస్తాను," అన్నాడు.

ఈ మాట విని అన్నదమ్ములిద్దరూ ప్రయోజకత్వం సాధించటానికి దేశాల మీద బయలుదేరారు.

పెద్దవాడైన రాములు అనేక దేశాలు తిరిగి, చివరకు విద్యాపురం అనే వూరు చేరాడు. అక్కడి దేవాలయాన్ని సమీపించేసరికి, అక్కడ పురాణ పఠనం జరుగుతున్నది. ఒక బ్రాహ్మణుడు ఎత్తయిన వేదిక మీద కూర్చుని, శ్లోకా

గంగిశెట్టి శివకుమార్



లను చదివి, చాలా చక్కగా వాటికి అర్థం చెబుతున్నాడు. ఆయన చుట్టూ జనం కూర్చుని, చెవులు రిక్కించి వింటు న్నారు. రాములు కూడా అందరితో పాటు చివరిదాకా పురాణం విన్నాడు.

పురాణం చెప్పటం పూర్తి అయి, ఆ బ్రాహ్మణుడు లేచి వెళ్ళిపోయేటప్పుడు, రాములు ఆయన వెనకనే ఆయన ఇంటి దాకా వెళ్ళి, ఆయన కాళ్ళు పట్టుకుని, తనకు విద్య చెప్పమన్నాడు.

బ్రాహ్మణుడు రాముల్ని లేవదీస్తూ, "నీకు చదువుకోవాలని ఆసక్తి ఉంటే నాకు చెప్పటానికి అభ్యంతరం లేదు, నాయనా," అన్నాడు.

అప్పటినుంచి రాములు గురుశుశ్రూష చేస్తూ, ఎంతో శ్రద్ధతోనూ, ఆసక్తితోనూ, విద్యాభ్యాసం చేస్తూ, కాలక్రమాన పండి తుడు అయాడు.

ఈ లోపల, చిన్నవాడైన రంగడు కూడా చాలా ఊళ్ళు తిరిగి, రామాపురం చేరి, ఒక సత్రం అరుగు మీద చేరాడు. ఇంతలో ఒక పెద్దమనిషి ఆ సత్రం ముందుగా వచ్చాడు. ఆయనను చూడ గానే సత్రం యజమానితో సహా అక్కడ వాళ్లందరూ లేచి నిలబడి, ఆయనకు నమస్కారాలు చేశారు. ఆ పెద్దమనిషి చూసీచూడకుండా, హుందాగా ముందుకు సాగిపోయాడు.

రంగడికి ఇదేమీ బోధపడలేదు. వాడు సత్రం యజమానిని ఆ పెద్దమనిషి ఎవరని అడిగాడు.

"ఆయన ఈ ఊరిలోకెల్లా గొప్ప ధనికుడు. ముప్పైతరాల దాకా కూర్చుని తిన్నా తరగనంత ధనం ఉన్నది ఆయన దగ్గిర. అందుచేత ఆయనతో గ్రామంలోని వాళ్ళందరూ మంచిగా, మర్యాదగా ఉంటారు." అని చెప్పాడు సత్రం యజమాని.

రంగడికి డబ్బు విలువ అర్థమయింది. వాడు ఆ ధనికుడి వద్ద నౌకరీకి కుదిరి జీవనోపాధి కలిగించుకోవటమే గాక,

ధనం సంపాదించే కిటుకులు కూడా తెలుసుకోవచ్చుననుకున్నాడు.

వెంటనే వాడు గబగబా ఆ ధనికుడి వెనకనే వెళ్ళి, ఆయన నౌకర్లతో మంచిగా మాట్లాడి, తనకు కూడా ఆయన వద్ద నౌకరీ ఇప్పించమని కోరుకున్నాడు. వాళ్లు రంగడికి కూడా ధనికుడి వద్ద పని ఇప్పించారు.

రంగడు ధనికుడి వద్ద సేవకు కుదిరి, తనకు వచ్చే జీతంలో తాను చిల్లి గవ్వ కూడా వెనక వెయ్యలేనని త్వరలోనే తెలుసుకున్నాడు. ఎందుకంటే అంత ధనికుడై ఉండి కూడా ఆయన డబ్బు దగ్గిర చాలా పెద్ద లోభి. అంతేగాక ఆయన డబ్బు సంపాదించటానికి చెయ్యని మోసం లేదని మిగిలిన నౌకర్లు రంగడికి చెప్పారు.

సోమయ్య పెట్టిన గడువు పూర్తి కావస్తున్నది, కాని రంగడు సాధించినది ఏమీలేదు. ఒకరాత్రి ధనికుడి భవంతిలో అందరూ నిద్రపోతున్నారు. ఆ సమయంలో ఏదో చప్పుడు వినిపించి రంగడు నిద్రలేచాడు. ఎందుకైనా మంచిదని వాడు దుడ్డు కర్ర తీసుకుని నిశ్శబ్దంగా చప్పుడైన చోటికి వెళ్లాడు.

ఇద్దరు దొంగలు కన్నంవేసి లోపలికి ప్రవేశించి, చాలా సొమ్ము పోగుచేసి, దానితో పారిపోవటానికి సిద్ధంగా ఉన్నారు. వాళ్ళు రంగణ్ణీ, వాడి చేతిలో దుడ్డు కర్రనూ చూసి భయపడ్డారు. వాడు



వాళ్లను కొట్టటానికి కర్ర ఎత్తేసరికి, "మమ్మల్ని కొట్టకు, దొంగిలించిన దానిలో సగం ఇస్తాం, మమ్మల్ని ప్రాణాలతో వదిలిపెట్టు!" అన్నాడు ఒక దొంగ వణుకుతూ.

రంగడు మెత్తబడి క్షణం ఆలోచించాడు. దొంగసొమ్ములో వాటా తీసుకోవటం తప్పేనేమో అనిపించింది. కాని ఆ డబ్బు సంపాదించటానికే తన యజమాని ఎన్ని మోసాలు చెయ్యలేదు? వాడు దొంగలు చెప్పిన దానికి ఒప్పుకున్నాడు. దొంగలు వాడికి తాను తమ దోపిడిలో సగం ఇచ్చి వెళ్ళిపోయారు. రంగడు తన సొమ్మును భద్రంగా దాచుకున్నాడు.

మర్నాడు ధనికుడు దొంగతనం తెలుసుకుని, నౌకర్లనందరినీ తిట్టాడు. దొంగల కోసం వెతికారు గాని ఫలితం లేకపోయింది.

తరవాత కొన్ని రోజులకు రంగడు పని మానుకుని, తాను దాచి ఉంచిన డబ్బు తీసుకుని, సొంత వూరుకు చేరుకున్నాడు. అదే సమయానికి రాములు కూడా తిరిగి వచ్చాడు.

ఇద్దరిలోనూ కలిగిన మార్పు చూసి సోమయ్య సంతోషించాడు. రాముడు ఒక గ్రంథం తీసి అందులోనుంచి శ్లోకాలు చదివి, వాటి అర్థమూ, విశేషార్థమూ, గూఢార్థమూ చక్కగాచెప్పి, సోమయ్యను సంతోషపెట్టాడు.

రంగడు తన మూట విప్పి నాణ్యాలు నేల మీద పోశాడు. ఆ డబ్బు చూడగానే సోమయ్యకు కళ్ళు చెదిరాయి. ఆయన, పాపం, అంత డబ్బు ఎన్నడూ చూసి ఉండలేదు; అందుచేత ఆనందంతో రంగణ్ణి కౌగలించుకుని, తన కూతురు నిచ్చి పెళ్ళిచేశాడు.

రాముడు తనలో తను నవ్వుకుని తన చేతి మీదుగానే తమ్ముడి పెళ్లి జరిపించి, కొన్నాళ్ళు గ్రామంలోవుండి తరవాత తన విద్య రాణించే చోటు వెతుక్కుంటూ వెళ్ళిపోయాడు.





# ఉచిత సలహాలు

నారయ్యకు తాతలనాటి పూరి పాక ఒకటి ఉన్నది. దానిని అనుకుని విశాలమైన పెరడు ఉన్నది. నారయ్య ఆ పెరట్లో అరటిపిలకలు నాటాడు. అరటితోట ఏపుగా పెరిగి, పచ్చగా, కంటికి ఇంపుగా ఉన్నది.

ఒక రోజు ఉదయం నారయ్య అరటి తోటలో కాలువలు సరిచేస్తూ ఉండగా జమీందారుగారి పాత గుర్రపుబండి వచ్చి ఆగింది. అది చూసి నారయ్య ఆశ్చర్య పడుతూండగా, బండిలో నుంచి జమీందారుగారి భార్య దిగి, నారయ్యను పిలిచింది.

నారయ్య హడావిడిగా మట్టిచేతులు కడుక్కుని, పైపంచతో తుడుచుకుంటూ వచ్చాడు.

ఆమె అతని పేరు అడిగి తెలుసుకుని, ''చూడు, నారయ్యా, పెరటితో సహా నీ పాకను నాకు అమ్ముతావా?'' అని అడిగింది.

నారయ్య ఆశ్చర్యపోతూ జవాబు చెప్ప లేదు. జమీందారుగారి భార్యకు తన పూరిపాకతో ఏం పనో అతనికి అంతు బట్టలేదు.

''డబ్బు గురించి సందేహించకు, అయిదు వందలు ఇస్తాను,'' అన్నదామె.

నారయ్య తన చెవులను తానే నమ్మ లేకపోయాడు. ఆ పూరిపాకకు ఎవరూ రెండువందలు కూడా ఇయ్యరు. అందు చేత, ఆమె అయిదు వందలు అనేసరికి అతని నోట మాటరాలేదు.

అతను మాట్లాడక పోవటం చూసి జమీందారుగారి భార్య, ఆ మొత్తం చాల లేదు కాబోలు ననుకుని, ''సరే, ఏడు వందల యాభై ఇస్తాను. మరి మాట్లాడకు,'' అన్నది.

ఎం. కామేశ్వరరావు



"సాయంత్రం డబ్బు ఇచ్చి మనిషిని పంపుతాను," అని జమీందారుగారి భార్య చాలా తృప్తిపడ్డట్టు కనిపిస్తూ, బండి ఎక్కి వెళ్ళిపోయింది.

అవిడ అలా వెళ్ళగానే నారయ్య తన భార్యను ఉద్దేశించి, "మన పంట పండిందేవ్!" అంటూ ఎగిరి గంతు వేశాడు.

జమీందారుగారి బండి నారయ్య పాక ముందు ఆగిన క్షణం నుంచీ ఇరుగు పొరుగుల వాళ్లు అంతా శ్రద్ధగా వింటూనే వున్నారు. వాళ్ళు అందరూ నారయ్య దగ్గిరికి వచ్చి, "పాకను నిజంగానే జమీందారుగారికి అమ్మేస్తావేమిటి?" అని వింతగా అడిగారు.

"వెయ్యి రూపాయలు వస్తూంటే అమ్మక ఏం చేస్తాను?" అన్నాడు నారయ్య.

"నీ తెలివి తెల్లవారినట్టే ఉన్నది! నీ ముష్టి పాకకు వెయ్యిరూపాయల ధర ఎందుకు పలికిందో ఆలోచించాలా, వద్దా? అవిడగారు ఏ లాభమూ చూసుకో కుండానే అంత డబ్బు ఇస్తున్నదా? నీ పెరట్లోనో, పాకలోనో ఏదో నిధినిక్షేపం ఉన్నట్టు ఆ విడకు రూఢిగా తెలిసి ఉండాలి. నువు వెర్రి వెధవవు కనుక అమ్మెయ్యటానికి సిద్ధపడ్డావు. చూడు!

నారయ్యకు మూర్ఛ వచ్చినంత పని అయింది. ఏడు వందల యాభై! అది పెట్టి ఎంత వ్యాపారమైనా చేసుకోవచ్చు నని అతను ఆలోచనలో పడ్డాడు.

అప్పటికీ నారయ్య సరేననకపోయే సరికి, జమీందారుగారి భార్య విసిగిపోయి, "ఆఖరి మాట! వెయ్యి రూపాయ లిస్తాను. నీ పాక ఇస్తావో ఇయ్యవో చెప్పెయ్యి," అన్నది.

నారయ్య అంగీకరించినట్టు తల ఊపి, "అమ్మగారూ, సాయంత్రం లోపల మేం పాకను ఖాళీచేసిపోతాం. సాయంత్రం మీరు దాన్ని స్వాధీనం చేసుకోవచ్చు," అన్నాడు.

ఏ పరిస్థితిలోనూ నువు నీ పాకను అమ్మకు. ఆ నిధినిక్షేపమేదో నువే తవ్వి తీసుకో. ముష్టి వెయ్యిరూపాయలకు ఆశ పడకు," అని నలుగురూ నారయ్యకు ఉచిత సలహాలు ఇచ్చి, ఉక్కిరి బిక్కిరి చేసి, వెళ్ళిపోయారు.

ఈ సలహాలు నారయ్యకు నచ్చాయి. అతని భార్య కూడా, "వాళ్ళు చెప్పినది నిజమే. రేపు కూతురికి పెళ్ళి చెయ్యబోతూ ఆవిడ వెయ్యిరూపాయలు పెట్టి ఈ పాక ఎందుకు కొంటుందీ? కూతుర్ని ఇందులో గృహ ప్రవేశం చేయిస్తుందా?" అన్నది.

సాయంత్రం జమీందారుగారి మనిషి డబ్బు తీసుకుని వచ్చినప్పుడు భార్యాభర్తలిద్దరూ పాకను అమ్మే ఉద్దేశం మానుకున్నామన్నారు. అతను వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి లాంతరు వెలుగులో నారయ్య పెరట్లోని అరటిచెట్లన్నీ పీకి పారేసి, పెరడంతా లోతుగా తవ్వి చూశాడు. ఏమీ దొరకలేదు. పాక లోపల తవ్వినా ఏమీ లేదు. కప్పంతా పీకి చూసినా ఫలితం లేకపోయింది.

తెల్లవారింది. "బంగారంలాంటి బేరం చెడగొట్టుకున్నాం," అన్నాడు నారయ్య ఏడుపు గొంతుతో.

"ఇప్పుడైనా మించిపోయిందేముందీ, నువు వెళ్ళి ఆవిడతో పాకను అమ్ముతామని చెప్పు. అయిదువందలు ఇస్తానన్నా



తటపటాయించక ఒప్పేసుకో,'' అన్నది నారయ్య భార్య.

నారయ్య జమీందారుగారి ఇంటికి వెళ్ళి, జమీందారుగారి భార్యతో, ''బుద్ధి లేక, నలుగురి సలహాలూ విని, పాకను అమ్మనని చెప్పాను. ఇప్పుడు అమ్మాలను కుంటున్నాను. మీకు తోచిన ధర ఇప్పిం చండి.'' అన్నాడు.

ఆమె చిన్నగా నవ్వి, ''ఇంక నీ పాక నాకు దేనికి? పందెం ఎలాగూ ఓడాను,'' అంటూ ఆమె తనకూ, జమీందారుగారికీ మధ్య పందెం మాట చెప్పింది.

జమీందారుగారి బండి తాత ముత్తాతల నాటిది. ఆమె కాపరానికి వచ్చినప్పటి నుండీ జమీందారుగారి చేత కొత్త బండి కొనిపించాలని ప్రయత్నిస్తున్నది. కాని జమీందారుకు పాతబండీ అంటే ప్రాణం. ఆయన తాత ముత్తాతలందరూ అందు లోనే ఊరేగారు.

''పూర్వీకుల నుంచి వస్తున్న వస్తువు లను ఎవరూ వదులుకోరు. చివరకు, ఊరి చివర అరటిపిలకలు నాటిన వాడు కూడా తన తాత ముత్తాతల నాటి పాకను వదులుకోడు. నిలువెత్తు ధనం పోసినా వాడు దాన్ని అమ్మడు. కావలిస్తే అడిగి చూడు!'' అన్నాడు జమీందారు.

దాని మీదట ఇద్దరూ వెయ్యేసి రూపా యలు పందెం వేసుకున్నారు. ఆ పందెం ఓడిపోయింది జమీందారు భార్య.

''పందెం గెలుస్తానన్న ధైర్యంతోనూ, జమీందారుగారి చేత కొత్త బండి కొని పించాలన్న పట్టుదలతోనూ వెయ్యిరూపా యలు నీ కిస్తా నన్నాను. నువు ఊళ్ళో వాళ్ళ ఉచిత సలహాలు విని నా ఆశలన్నీ నట్టేట ముంచావు. నీకు తెలుసా? నీకు సలహా లిచ్చిన వాళ్ళే నా దగ్గిరికి వచ్చి తమ ఇళ్ళను ఐదువందలకే ఇస్తా మన్నారు! నలుగురి మాటలూ విని నష్ట పోయావు. ఇకనైనా బుద్ధి తెచ్చుకో. వెళ్ళు,'' అన్నది జమీందారుగారి భార్య.

నారయ్య తలవంచుకుని ఇంటి దారి పట్టాడు.





చంద్రద్వీపవాసి అయిన చంద్ర సొదాగర్ అనే ప్రసిద్ధ వర్తకుడు మూడు నౌకలలో ఢాకా మేలివస్త్రాలూ, ముర్షి దాబాదు దంతమూ, కంచుసామగ్రీ, మంచిగంధపు చెక్క మొదలైన సరుకులు వేసుకుని, ఏడువందల మంది నావికులతో యవద్వీపానికి ప్రయాణమయాడు.

కొంతకాలం పాటు ప్రయాణం సుఖంగానే సాగింది. మూడో వారంలో ఒక జలసంధి వద్ద ప్రయాణీకులకు అనేక వింత దృశ్యాలు కనిపించాయి. వివేకమూ, విజ్ఞానమూ కలిగిన చంద్ర సొదాగర్ వాటిని లక్ష్యపెట్టలేదు. కాని మానవనైజం కొద్దీ ఒక వింత ఆయనను ఆకర్షించింది. ఆయనకు నీటిమీద నృత్యం చేస్తూ, బంగారు దంతాలుగల ఒక తెల్ల ఏనుగు కనిపించింది.

"ఎలాగైనా ఆ వింత ఏనుగును పట్టండి." అని ఆయన తన నావికులను హెచ్చరించాడు.

ఆయన నౌకలు ఆ ఏనుగును చుట్టుముట్ట యత్నించాయి. కాని ఏనుగు ఎలాగో తప్పించుకుని, మరి కొంతదూరంలో నీటిమీద నాట్యం చేస్తూ కనిపించింది. చంద్ర సొదాగర్ నౌకలు తిరిగి దాన్ని సమీపించి, పట్టుకోబోయాయి. ఏనుగు మళ్ళీ తప్పించుకుని, మరి కొంతదూరాన కనిపించింది. ఆ నౌకలు అలాపోయి, పోయి, దారి తప్పి విశాల సముద్రం ప్రవేశించాయి. సూర్యుడు అస్తమించాడు. సముద్రం మీద ప్రచండమైన గాలి రేగి, నౌకను ఈడ్చుకు పోయింది. చివరకు నౌకలు సముద్రంలోని ఒక రాతి గట్టును ఢీకొని బద్దలయి పోయాయి. సరుకూ, నావికులూ నీటిపాలయారు.

ఏ. సి. సర్కార్, ఐంద్రజాలికుడు



విరిగి పోయిన ఓడపలకల ఆధారంతో చంద్రసౌదాగర్, మరి ఆరుగురు నావికులూ తమ ప్రాణాలు దక్కించుకుని, రెండు రోజుల అనంతరం పర్వతమయమైన ఒక తీరాన్ని చేరుకున్నారు. ఆకలితోనూ, అలసటతోనూ ఉన్న ఆ ఏడుగురూ ఒక కొబ్బరిచెట్టు నుంచి గాలికి రాలిన కొబ్బరికాయలను పగలగొట్టి, తమ ఆకలి దప్పులను తీర్చుకున్నారు.

వాళ్ళు చేరిన ద్వీపం సముద్రతీరానికి చాలా ఎత్తున ఉన్నది. చుట్టూ ఉన్న కొండలు నిటారుగా, ఎక్కటానికి సాధ్యం కాకుండా ఉన్నాయి. ఏడుగురూ ద్వీపం చుట్టూ ప్రదక్షిణం చేసి, పడమర దిక్కున కొండల మధ్య సన్నని కనుమ ఉన్నట్టు కనిపెట్టారు. అయితే ఆ కనుమకు ఒక ద్వారం ఉన్నది. దానివద్ద భటులు కాపలా ఉన్నారు.

ఏడుగురూ అక్కడికి చేరగానే రక్షక భటులు వాళ్లను పట్టి బంధించి, కనుమ కుండా నగరంలోకి తీసుకుపోయారు. ఆ భటులు మాట్లాడే భాష చంద్రసౌదాగర్ బృందానికి తెలియదు. నగరం వీధుల వెంట నడుస్తూ వర్తకుడూ, అతని నావికులూ చాలా ఆశ్చర్యం చెందారు. ఎందుకంటే, ఆ నగరం అంతటా లక్ష్మి తాండవిస్తున్నది. సూర్యాస్తమయం వేళకు భటులు ఆ ఏడుగురినీ కారాగృహంలో పెట్టారు.

మర్నాడు ఉదయం భటులు వారిని రాజుగారి దర్బారుకు విచారణ నిమిత్తం తీసుకుపోయారు. చంద్రసౌదాగర్ మొదలైన వాళ్ళు రాజుకు వంగి నమస్కారం చేశారు. అది చూసి రాజు సంతోషించాడు.

రాజు వాళ్ళను తన భాషలో, "మీకు ఏం కావాలి?" అని అడిగాడు.

చంద్రసౌదాగర్ తన భాషలో, "మీరు చెప్పేది అర్థం కాలేదు," అన్నాడు.

ఇద్దరికీ ఒకరి భాష ఒకరికి తెలీదు. రాజు చేసేదిలేక సంజ్ఞల సహాయంతో

ప్రశ్నలు అడిగాడు. చంద్రసాదాగర్ సంజ్ఞలతోనే సమాధానాలు చెప్పాడు. అతనూ, అతని మనుషులూ సముద్రంలో ప్రమాదానికి గురి అయారనీ, వాళ్ళు ఈ నగరంలో స్థిరపడ గోరుతున్నారనీ రాజుకు అర్థమయింది.

రాజు ఒక లోటానూ, నీటి పాత్రనూ తెప్పించి, లోటా పూర్తిగా నిండినదాకా అందులో నీరు పోశాడు. తరవాత ఆయన, కొత్తవాళ్ళు ఏడుగురివద్దా ఏడు ఉంగరాలు తీసుకుని, వాటిని లోటాలో వేశాడు. లోటాలోని నీరు పొర్లి, పక్కలకు కారి పోయింది. నగరం అప్పటికే భర్తీగా ఉన్నదనీ, కొత్త వారిని చేర్చితే అశాంతి కలుగుతుందనీ రాజుగారి భావం.

ఇది గ్రహించి చంద్రసాదాగర్ బృందం వాళ్ళు హతాశులయారు. వారిని చూసి జాలిపడి రాజు, వారు నగరంలో రెండు రోజులు ఉండటానికి అనుమతి ఇచ్చాడు.

నావికులలో ఒకడు చంద్రసాదాగర్‌తో, "అయ్యా, మనం మరొక నౌక తయారు చేసుకున్నదాకా ఈ నగరంలోనే ఉండే మార్గం ఏదన్నా చూడండి," అన్నాడు.

"నేనూ అదే ఆలోచిస్తున్నాను," అంటూ చంద్రసాదాగర్ తన అనుచరులతో నగరపర్యటన ప్రారంభించాడు. వాళ్ళు నడుస్తూ, నడుస్తూ ఒక దుకాణం




ముందు ఆగారు. ఆ దుకాణంలో గృహ పరికరాలు అమ్ముతారు. ఆ దుకాణం చూడగానే చంద్రసాదాగర్‌కు ఒక ఆలోచన వచ్చింది.

వెంటనే అతను తన చేతికి ఉన్న మూడు ఉంగరాలలో ఒకటి కుదువబెట్టి ఒక పొడుగు గొట్టం గల చిన్న గరాటీ, ఒక గాజులోటా కొన్నాడు.

"ఎందుకివి?" అని అతని అనుచరుడు ఒకడు అడిగాడు.

"చూస్తూ ఉండు," అన్నాడు చంద్రసాదాగర్.

అతను తన అనుచరులతో సహా రాజుగారి దర్బారుకు వెళ్ళాడు. అతని చేతిలో

లోటా ఉన్నది. గరాటీ మాత్రం అతని జేబులో గోప్యంగా ఉన్నది. అతను రాజు గారికి వందనం చేసి, పక్కనే ఉన్న గదిలో తాను కొంతసేపు నిలవటానకి అనుమతి పొందాడు. అతను ఒక పాత్రలో నీరు తీసుకుని, తన అనుచరులతోసహా ఆ గది ప్రవేశించాడు.

కొద్దిసేపు గడిచాక చంద్రసొదాగర్ ఆ గది నుంచి సభలోకి వచ్చి, రాజు గారిని గదిలోకి ఆహ్వానించాడు.

రాజు లోపలికి రాగానే చంద్రసొదాగర్ తనవీ, తన అనుచరులవీ ఏడు ఉంగరాలు పోగుచేసి, నిండుగా నీరున్న గాజు లోటాను రాజుగారికి చూపి, తరవాత ఏడు ఉంగరాలనూ ఒకదాని తరవాత ఒకటిగా లోటాలోకి జారవిడిచాడు. ఒక్క చుక్క నీరు కూడా పొర్లి పోలేదు. లోటా నిండా ఉండిన నీరు ఏడు ఉంగరాలకూ చోటు ఇచ్చింది.

రాజు మెచ్చుకుంటున్నట్టుగా నవ్వి, చంద్రసొదాగర్ భుజం తట్టాడు. ఆయన అతనికి ఒక ఉంగరం బహుమానంగా ఇస్తూ, మంత్రి చెవిలో ఏదో చెప్పాడు. మంత్రి సంజ్ఞల ద్వారానూ, అభినయం ద్వారానూ చంద్రసొదాగర్‌తో, అతని బృందం తమ ఇష్టం వచ్చినంత కాలం ఆ రాజ్యంలో ఉండవచ్చు నని అర్థమయేటట్టు చెప్పాడు.

చంద్రసొదాగర్‌కు తెలిసిన ఇంద్రజాలం అతనికీ, అతని అనుచరులకూ అక్కరకు వచ్చింది.

అతను గదిలో ఏం చేశాడు? అతను ముందుగా లోటా అంచును గుడ్డతో తడి ఏ మాత్రమూ లేకుండా తుడిచి, గరాటీ సహాయంతో లోటా నిండా నీరునింపి, అంచు ఏ మాత్రమూ తడికాకుండా జాగ్రత్త పడ్డాడు. అదే అతని ఇంద్రజాలానికి కీలకం. లోటా అంచు ఏ మాత్రం తడిగా ఉన్నా నీరు పొర్లిపోయేదే. అలాగే ఉంగరాలు లోటాలో వేసేటప్పుడు కూడా అతను నీరు చింది అంచు తడికాకుండా చూసుకున్నాడు.



# 161. ప్రాచీన శ్మశాననిక్షేపాలు

క్రిమియా ద్వీప కల్పంలోని ఈశాన్య ప్రాంతంలో కిందటేడు (1974 మధ్యలో) ఒక ప్రాచీన శ్మశానం బయటపడింది. దీన్ని నగైచిన్స్కీ దిబ్బ అంటారు. ఇందులో కంచు అద్దమూ, వెండి పాత్రలూ, బంగారు కంకణాలూ, గొలుసూ మొదలైన అనేక వస్తువులు దొరికాయి. వీటిని రెండువేల ఏళ్ళ క్రితం సర్మాతియా, గ్రీసుశిల్పులు తయారుచేశారు. రత్నాలు పొదిగిన ఈ ఆభరణాలన్నీ ఒక సర్మాతియా రాణివి అని భావిస్తున్నారు. ఆభరణాలలోని శిల్పం బొమ్మలో చూడవచ్చు.





# మిత్రద్వయం

పూర్వం అజీకర్తుడు అనే ముని దగ్గిర ఇద్దరు శిష్యులు ఉండేవారు. వారిలో శునశ్శేపుడు కోపిష్ఠి. అతను తన సహాధ్యాయి అయిన రోహితుడితో ఎప్పుడూ జగడం ఆడుతూ ఉండేవాడు. అందుచేత రోహితుడు సాధ్యమైనంత వరకు అతనికి దూరంగా ఉండసాగాడు.

ఒకప్పుడు అన్యోన్యంగా ఉండిన తన శిష్యులు రాను రాను దూరం అయిపోవటం అజీకర్తముని గమనించాడు. ఒకనాడు ఆయన రోహితుడితో, "మీరిద్దరూ ఎడా, పెడాగా ఉంటున్నారేం? నువు వాడి కన్న ఒక ఏడాది పెద్దవాడివి గనక నిన్ను అడుగుతున్నాను," అన్నాడు.

"అయ్యా, వాడికి కోపం హెచ్చు. ఇద్దరమూ కలిసి ఉంటే చీటికీ, మాటికీ జగడం వస్తున్నది. వాడి కోపం నన్ను కూడా అంటుతుందని భయం కలిగి, ఇలా దూరంగా ఉంటున్నాను," అన్నాడు రోహితుడు.

"నీకు వాడి మీద సద్భావం ఉన్నట్టు వాడికి అర్థమయితే చాలునే! వాడి కోపం నీకు అంటుకునేది నిజమైతే, నీ శాంతం కూడా వాడికి అంటవచ్చుగద! ఆ విథంగా వాడి కోపం చల్లారిపోవచ్చు. ఇందుకు నిదర్శనంగా ఒక కథ చెబుతాను, విను," అంటూ అజీకర్తముని ఇలా చెప్పాడు:

ఒక గ్రామంలో రమానందు డనీ, సీమానందు డనీ ఇద్దరు మిత్రులుండేవాళ్ళు. వాళ్ళు వ్యవసాయదార్లు; ఊళ్లో వాళ్ళకు అనేక విధాల సహాయపడుతూ, అందరికీ ఎంతో ఇష్టంగా ఉండేవాళ్ళు. వాళ్లను అందరూ జంట మిత్రులని పిలిచేవాళ్ళు.

ఇలా ఉండగా ఏదో స్వల్ప కారణం వల్ల మిత్రులిద్దరి మధ్యా భేదం

ఎల్. మాధవరావు

వచ్చి, క్రమంగా అది పెద్ద పగగా పరిణమించింది. చివరకు ఆ మిత్రులు ఒకరి నొకరు చూడటమూ, ఒకరితో ఒకరు మాట్లాడటమూ మానేశారు.

ఇందువల్ల ఇద్దరికీ కొంత నష్టం కలిగింది. వాళ్ళు ఇప్పుడు పూర్వంలాగా ఊళ్లో వాళ్లకు సహాయం కూడా చెయ్యలేక పోతున్నారు: స్నేహానికి సమర్థింపు అవసరం లేదు కాని విరోధానికి కావాలి. అందుచేత ఊళ్లో వాళ్ల దగ్గిర వాళ్లు ఒకరి మీద ఒకరు నిందవేస్తూ మాట్లాడసాగారు. ఈ కారణం చేత తిరిగి వాళ్ళ మధ్య సఖ్యత ఏర్పడే అవకాశం లేకుండా పోయింది.

ఈ పరిస్థితిలో గురుమూర్తి అనే పెద్ద మనిషి, వాళ్ళిద్దరి మధ్యా తిరిగి సఖ్యం ఏర్పడటం కోసం ఒక ఉపాయం పన్నాడు.

ఊరి చివర మంటపంలో ఒక యోగి ఉన్నాడనీ, ఆయన అందరి మానసిక బాధలూ కుదుర్చుతాడనీ, శరీరవ్యాధులు నివారణ చేస్తాడనీ ఒక వార్త పాకింది. అనేకమంది ఆయన దర్శనం చేసుకున్నారు. రమానందుడు కూడా వెళ్ళి ఆయనను చూశాడు.

యోగి అతనితో, "నీలో ఒక గొప్ప విశేషం ఉన్నది. నువు ఎవణ్ణి ప్రీతిగా



ఆలింగనం చేస్తావో వాడు గొప్ప ధనికుడవుతాడు. వాడివల్ల నీకు కూడా లాభిస్తుంది. అయితే నువు ఆలింగనం చేసుకునే వ్యక్తి నీకు ఉపకారం చేసేవాడుగా ఉండాలి. ఆ సంగతి ఆలోచించి మరీ ఆలింగనం చెయ్యి," అన్నాడు.

తరవాత రమానందుడు తను ఎవరిని ఆలింగనం చేసుకోవాలా అని ఆలోచన చేశాడు. అతనికి అర్హులెవరూ కనిపించలేదు. సీమానందుడితో తనకు విరోధం ఉండిపోయింది గాని, అతనే నిజంగా అందరికన్నా అర్హుడు.

ఈ లోపల సీమానందుడు కూడా యోగిని చూడబోయాడు.

యోగి అతనితో, "నిన్ను ఎవరైనా ప్రీతిగా ఆలింగనం చేసుకుంటే నీ కష్టా లన్నీతొలగి, నువు ధనికుడివైపోతావు. కాని నువు ఎవరినైనా ఆలింగనం చేసుకుంటే వాడు నీ కళ్ళ ఎదుటనే చస్తాడు," అని చెప్పాడు.

తనను ఎవరు ఆలింగనం చేసు కుంటారా అని సీమానందుడూ, తాను ఎవరిని ఆలింగనం చేసుకుంటే బాగుం టుందా అని రమానందుడూ కాలుకాలిన పిల్లుల్లాగ ఊరంతా చుట్టబెట్టసాగారు. అందుచేత వాళ్లు మళ్లీ మళ్లీ తారసిల్లటం జరిగింది.

చూసి, చూసి, కోపస్వభావుడైన సీమానందుడు, "వీడు చస్తేగాని నన్ను ఆలింగనం చేసేవాడు దొరకడు!" అనుకుని రమానందుణ్ణి కౌగలించు కున్నాడు. తనకు చెప్పినట్లే యోగి సీమా నందుడికి చెప్పి ఉంటాడనీ, తన మేలు కోరి సీమానందుడు తనను ఆలింగనం చేసుకున్నాడనీ అనుకుని రమానందుడు అతన్ని ప్రీతితో తాను కూడా ఆలింగనం చేసుకున్నాడు.

తరవాత ఇద్దరూ కూడబలుక్కునే సరికి, యోగి తమకు వేరువేరుగా చెప్పి నట్టు తెలిసింది. ఇద్దరూ యోగి దగ్గిరికి వెళ్ళారు.

సీమానందుడు యోగితో, "నేను దుర్బుద్ధితో రమానందుణ్ణి ఆలింగనం చేసుకుని, అతన్ని చావుకు గురిచేశాను. అతన్ని ఎలాగైనా కాపాడండి," అని బతిమాలాడు.

"భయపడకు. నువు ముందులాగే అతనితో స్నేహంగా ఉంటే ఏ ఆపదా రాదు. మీ ఇద్దరినీ తిరిగి కలపటానికే నేను అలా చెప్పాను," అంటూ గురు మూర్తి తన యోగి వేషం తీసేశాడు.

తరవాత రమానందుడూ, సీమా నందుడూ ఎంతో స్నేహంగా ఉన్నారు.

ఈ కథ విని రోహితుడు, "ఇకమీదట నేను శునశ్శేపుడితో స్నేహంగా ఉంటాను," అన్నాడు.






# రత్నహారం

సుందరపురాన్ని పాలించే మాధవుడు దక్షత గలవాడూ, దయ గలవాడూనూ. అతనికి ఇద్దరు రాణులు ఉండేవారు. ఒకసారి మాధవుడు ఒక విదేశీ నగల వర్తకుడి వద్ద చాలా విలువగల రత్న హారాన్ని చూసి ముచ్చటపడి, బోలెడంత డబ్బు పోసి కొని, దాన్ని తన పెద్దరాణికి బహుమానంగా ఇచ్చాడు. ఇందువల్ల చిన్నరాణికి చాలా బాధ కలిగింది, కాని పైకి అనటానికి లేక ఊరకుండి పోయింది. ఈ హారం గురించిన వార్త చుట్టుపక్కల దేశాలకు పాకింది.

మాధవుడికి త్రినాథు డనే మంత్రి ఉండేవాడు. ఆయనకు ఒకే ఒక కుమార్తె ఉన్నది. ఆమె మూగపిల్ల కావటం చేత, యుక్తవయసు వచ్చినా వివాహం జరగ లేదు. ఇది మంత్రికి తీరని దిగులుగా ఉండేది.

ఇలా ఉండగా పొరుగుదేశపు మంత్రి కొంత పరివారంతో తలవని తలంపుగా త్రినాథుడి ఇంటికి వచ్చి, ఏకాంతంగా త్రినాథుడితో, "నేను ఒక షరతు మీద మీ అమ్మాయిని మా అబ్బాయికి ఇయ్య మని అడగటానికి వచ్చాను. మీ పెద్ద రాణిగారి రత్నహారం మాకు ఇయ్యాలి," అన్నాడు.

త్రినాథుడు నివ్వెరపోయి, "అదేమిటి? రాణిగారి రత్నహారం నాకు ఎలా వస్తుంది?" అన్నాడు.

"అదంతా నాకు తెలియదు. కాని ఆ హారం ఇవ్వనిదే ఈ పెళ్ళి జరగదు," అన్నాడు పొరుగు దేశపు మంత్రి, తిరిగి తన దేశానికి బయులుదేరుతూ.

త్రినాథుడు చాలా విశ్వాసపాత్రుడు. ఆ రాత్రి ఆయన తన భార్యతో ఈ విషయం మాట్లాడుతూ, "ఈ పొరుగు దేశపు

టి. మనోహర్



మంత్రి కేవలమూ రత్నహారం కోసమే మన మూగపిల్లను చేసుకుంటున్నాడు. మన పిల్లకు పెళ్లి కాకపోయినా ఫరవాలేదు గాని నేను రాజద్రోహం మటుకు చెయ్యను,'' అన్నాడు.

త్రినాథుడు తన భార్యతో ఈ విషయాలు మాట్లాడుకునే సమయంలో, మారు వేషంలో తిరుగుతున్న రాజు బయట ఉండి అంతా విన్నాడు. ఎలాగైనా తన మంత్రి కూతురి పెళ్ళి జరిపించాలని నిశ్చయించుకుని, ఆయన మంత్రి ఇంట్లోకి ప్రవేశించాడు.

అంతరాత్రి వేళ లోపలికి వచ్చిన మనిషిని చూసి త్రినాథుడు ఆశ్చర్యపోయి, మారువేషంలో ఉన్న రాజును పోల్చుకోలేక, ''ఎవరు నువు?'' అన్నాడు.

''నిజం చెప్పాలంటే నేనొక గజ దొంగను. మీ ఇంట్లో దొంగతనం చేద్దామని వచ్చాను. కాని బయట నిలబడి మీరు మాట్లాడుకున్నదంతా వినేసరికి, మీరు మీ పిల్ల పెళ్ళి గురించి ఎంత చిక్కులో ఉన్నారో అర్థమయింది. నేను ఏదో విధంగా రాణీగారి రత్నహారాన్ని తెచ్చి మీకిస్తాను,'' అన్నాడు రాజు.

''ఛీ, ఛీ! అందుకు నేను ఎంత మాత్రమూ ఒప్పుకోను,'' అన్నాడు త్రినాథుడు.

''తొందరపడకండి. దొంగతనం చేస్తున్నది మీరు కాదు, నేను. నా స్వార్థం ఇందులో ఏమీ లేదు,'' అన్నాడు రాజు.

త్రినాథుడితో ఆయన భార్య, ''ఒప్పుకుందురూ! పిల్ల పెళ్ళి అయిపోయినాక మనమే రాజుగారికి సంగతంతా చెప్పి శిక్ష అనుభవింతాం,'' అన్నది.

త్రినాథుడు ఎలాగో ఒప్పుకున్నాడు.

మర్నాడు రాజు సమర్థుడైన స్వర్ణకారుణ్ణి కోటకు పిలిపించి, అతన్ని ఒక రహస్య మందిరంలో ఉంచి, అతని చేత వారం రోజుల లోపల రత్నహారాన్ని పోలిన నకిలీ హారం చేయించి, అతనికి మంచి బహుమానం ఇచ్చి పంపేశాడు.

తరవాత ఆయన మారువేషంలో మంత్రి ఇంటికి వెళ్ళి, నకిలీ హారం మంత్రి చేతిలో పెట్టి, "ఇక పెళ్ళి జరిపించండి," అన్నాడు.

మంత్రి కుమార్తె పెళ్ళి నిర్విఘ్నంగా జరిగిపోయింది. రాజు స్వయంగా వెళ్ళి వధూవరులకు కానుకలు చదివించి, ఆశీర్వదించి, రాజ భవనానికి తిరిగి వచ్చాడు.

పెద్దరాణి ఆయన వద్దకు వచ్చి, తన రత్నహారాన్ని చూపిస్తూ, "చూడండీ, ఈ రత్నాలలో వెనక ఉండిన మెరుపు లేనట్టు కనబడుతుంది?" అన్నది.

రాజు దాన్ని తన చేతిలోకి తీసుకున్న మరుక్షణం అది నకిలీ హారమని తెలుసుకున్నాడు. తానే పొరపాటు పడి నకిలీ హారానికి బదులు అసలు హారాన్ని మంత్రికి ఇచ్చి ఉండాలని ఆయనకు అనుమానం వచ్చింది. అందుచేత ఆ రాత్రి ఆయన తానొక దొంగ వేషం వేసుకుని, తన భటులకు కొందరికి కూడా అలాటి వేషాలే వేసి, పొరుగు దేశపు మంత్రి పరివారం ఉండే విడిదిపై దాడి చేశాడు.

ఈ దాడిలో దొరికిన నగలన్నీ పరీక్షిస్తే అందులో రత్నహారం దొరికింది. కాని అది కూడా నకిలీ హారమే. ఈ వింత రాజుకు అర్థం కాలేదు.



మర్నాడు ఉదయం త్రినాథుడు వచ్చి, "మహారాజా, మా వియ్యాలవారి విడిది పైన దొంగలు పడి నగలన్నీ దోచుకున్నారట. ఇంతకన్న కూడా దారుణమైన విషయం తమకు మనవి చేయాలి. ఒక గజ దొంగ ద్వారా నేను పెద్ద రాణీగారి రత్నహారం సంపాదించి, అది నా అల్లుడికి కట్నంగా ఇచ్చాను. అందుకు నాకు తగిన శిక్ష విధించవలసిందిగా కోరుతున్నాను," అన్నాడు.

రాజు త్రినాథుడితో, "మీవల్ల ఏ దొంగతనమూ జరగలేదు. మీ వియ్యాలవారు పోగొట్టుకున్నదంతా వారికి తిరిగి వచ్చేటట్టు చూస్తాను," అన్నాడు.



41

తరవాత ఆయన స్వర్ణకారుణ్ణి పిలిపించి, "నువు నాకు నకిలీ రత్నహారం ఇచ్చినప్పుడు దానితోబాటు అసలు హారం ఇయ్యలేదు. మరొక నకిలీహారం ఇచ్చావు. ఇది ఎలా జరిగిందో చెప్పకపోతే నిన్ను కొరత వేయిస్తాను," అన్నాడు.

స్వర్ణకారుడు రాజు కాళ్ళపైన పడి, "క్షమించండి, మహారాజా! నేను రెండు నకిలీ హారాలను చేసిన మాట నిజమే. అంతఃపురం నుంచి మంజరి అనే దాసీది వచ్చి, చిన్నరాణిగారి కోసం మరొక నకిలీ హారం కావాలనీ, ఆ మాట రహస్యంగా ఉంచమనీ నాకు చాలా డబ్బు ఇచ్చింది. తరవాత ఆమె మూడు హారాలూ ఉంచిన పెట్టె నుంచి నకిలీహారం తీసుకుపోయిందనుకున్నాను. మీకు మిగిలిన రెండు హారాలూ అందజేశాను," అన్నాడు.

రాజు స్వర్ణకారుణ్ణి పంపేసి, మంజరి అనే చిన్నరాణిగారి దాసీని పిలిపించి, నిజం చెప్పమన్నాడు. ఆమె ప్రాణ భయంతో వణికిపోతూ, తాను స్వర్ణకారుడి కన్ను కప్పి, అసలు హారాన్ని చిన్నరాణికి చేర్చినట్టు చెప్పింది.

రాజు చిరాకుపడి, చిన్నరాణిని పిలిపించి, "ఈ కుట్ర అంతా ఏమిటి?" అని అడిగాడు.

"స్త్రీలకు నగల మీదా, చీరల మీదా మోజు ఉండదా? మీరు అక్కగారికి అంత విలవైన హారం ఇచ్చి నాకు ఏమీ లేకుండా చేశారు. ఆ హారాన్ని ధరించాలని నాకు మాత్రం ఉండదా? నేను నోరు తెరిచి మిమ్మల్ని అడుగుతానా? మీరు నా మనసు ఆ మాత్రం గ్రహించవద్దా? అది జరగకనే నేను చిన్న కుట్ర చేసి హారం సంపాదించాను. తప్పు అయితే క్షమించండి," అన్నది చిన్నరాణి.

రాజు వివేకం గలవాడు గనక తన తప్పు ఒప్పుకుని, ఆ స్వర్ణకారుణ్ణే నియోగించి, చిన్నరాణికి కూడా అలాటిదే మరొక రత్నహాం చేయించి, అటు తరవాత రాణులిద్దరిపట్లా పక్షపాతం లేకుండా సమంగా ప్రవర్తించాడు.



# న్యాయమైన కూలి

కామయ్య వద్ద నాలుగుగజాల చదరపు రాతిపలక ఉన్నది. దాన్ని ఆయన నాలుగు పలకలుగా చేయింతామనుకుని, వెంకయ్య అనే రాతిపని చేసే వాణ్ణి మాట్లాడాడు. నాలుగు రూపాయలు కూలి ఇయ్యమన్నాడు వెంకయ్య. కామయ్య సరేనన్నాడు.

వెంకయ్య ఒక రోజల్లా పని చేసి పెద్దపలక నుంచి ఒక చిన్న పలకనే తీశాడు. అతను మర్నాడు పనిలోకి రాకపోయేసరికి, కామయ్య ధర్మయ్య అనే మరో పనివాణ్ణి పిలిచాడు. ధర్మయ్య కూడా రోజంతా పనిచేసి మిగిలిన మూడు చిన్న పలకలూ తీశాడు.

తరవాత కామయ్య ఇద్దరికీ కూలి ఇచ్చేటప్పుడు వెంకయ్యకు ఒక రూపాయీ, ధర్మయ్యకు మూడు రూపాయలూ ఇయ్యబోయాడు.

"ఇద్దరమూ చెరొకరోజూ పనిచేశాం గనక, చెరి రెండు రూపాయలూ ఇప్పించండి," అన్నాడు వెంకయ్య.

"అది అన్యాయం కదా. ధర్మయ్య మూడు ముక్కలు తీశాడు. నువు ఒకటే తీశావు," అన్నాడు కామయ్య.

దారేవెళ్ళే దానయ్య విషయమంతా విని, "కామయ్యగారూ, ఇద్దరూ సమానంగానే పని చేశారు. ఒకమూల ముక్క ఒకడు తీశాడు. ఇంకో మూలముక్క ఇంకొకడు తీశాడు. ఇద్దరికీ సమంగానే కూలి ఇయ్యాలి," అన్నాడు.

కామయ్యకు విషయం బోధపడి, ఇద్దరికీ చెరి రెండు రూపాయలూ ఇచ్చాడు.

—పి. సి. సుబ్బారెడ్డి.





# నేరపరిశోధన

ఒక ఊళ్ళో రామయ్య అనే పేద రైతు ఉండేవాడు. రామయ్యకు ఒక ఎకరం పొలం ఉండేది. ఆ ఊళ్ళోనే ఉండే సోమిశెట్టి అనే వ్యాపారస్థుడికి బాకీపడి రామయ్య ఆ ఎకరం పొలాన్ని సోమిశెట్టికి ఇచ్చేశాడు.

ఇప్పుడు రామయ్యకు ఒక మంచి పాడిఆవు తప్ప వేరే అధారం లేదు. అతను ఆ ఆవు పాలను సోమిశెట్టికే అమ్మి, ఆ వచ్చిన డబ్బుతో అతని దుకాణంలోనే వెచ్చాలు కొని జీవితం వెళ్ళబుచ్చుతున్నాడు.

సోమిశెట్టి ఆ ఆవు మీద కన్నువేశాడు. అది తనది అయితే తనకు తన దుకాణం నుంచి రామయ్యకు సరకులు ఇచ్చే అవసరం తప్పుతుందని శెట్టి ఆశ.

ఒకరోజు జడివాన పట్టుకున్నది. రామయ్య ఆవును మేతకు బయట వదలలేక పోయాడు. దాన్ని అతను రోజల్లా పాకలోనే కట్టి ఉంచాడు. దానికి వెయ్యటానికి అతని వద్ద ఎండు గడ్డి కూడా లేదు. తిండిలేని కారణం చేత అది మర్నాడు పాలియ్యదేమోనని భయపడుతూ ఆ రాత్రి రామయ్య కలత నిద్ర పోయాడు.

ఆ రాత్రి ఆ ఆవు కట్టుతాడు తెంచుకుని, ఊరి బయటికిపోయి సోమిశెట్టి పొలంలో పడి మేసింది. ఈ సంగతి రామయ్యకు తెలియదు.

మర్నాడు ఉదయం సోమిశెట్టి సలుగురు పెద్ద మనుషులను వెంటబెట్టుకుని రామయ్య ఇంటికి వచ్చి, "నీ ఆవు నా పొలంలో పడి మేసేసింది. కష్టపడి పండించిన పంట అంతా నాశనమయింది. దీనికి ఏం చెబుతావు?" అని గడబిడ చేశాడు.

బుద్ధుల రామసుధ

రామయ్య్య పెద్ద మనుషులను అడిగితే, అలా జరిగిన మాట నిజమేనని చెప్పారు.

"నాకు కాస్తా కూస్తా కాదు రెండు వందల వరహాల పంట నష్టమయింది." అన్నాడు సోమిశెట్టి.

"నీ ఆవును సోమిశెట్టికి ఇచ్చావంటే నష్టపరిహారం కింద సరిపోతుంది." అని రామయ్యతో పెద్ద మనుషులు అన్నారు. సోమిశెట్టి అక్కడికొస్తూ చేసిన ఆలోచన కూడా అదే.

కాని అవును సోమిశెట్టికి ఇస్తే రామయ్యకు జీవనాధారం ఏదీ ఉండదు. అందుచేత అతను అవును సోమిశెట్టికి ఇయ్యటానికి ఒప్పుకోలేదు. పెద్ద మనుషులు రామయ్యకు ఎన్నో విధాల చెప్పి చూశారు. కాని, అతడు ఆవును యివ్వనని మొండికెత్తాడు.

సోమిశెట్టి గ్రామాధికారి వద్ద ఫిర్యాదు చేశాడు. గ్రామాధికారి జరిగినదంతా విని రామయ్యతో, "నీ అజాగ్రత్త వల్లనే సోమిశెట్టి పంట పాడయిందని, రుజువయింది. కనక, నువు నష్ట పరిహారం కింద నీ ఆవును సోమిశెట్టికి ఇయ్యటమే న్యాయం." అన్నాడు.

ఈ తీర్పు న్యాయంగానే ఉన్నదని ఊళ్ళో పెద్దలు అంగీకరించారు.

విధిలేక రామయ్య్య తన ఆవును సోమిశెట్టికి ఇచ్చి, పుట్టెడు విచారంలో మునిగిపోయాడు. ఎంత ఆలోచించినా తనకు



అన్యాయమే జరిగినట్టు రామయ్యకు తోచింది. ఆ దేశపు న్యాయాధికారి న్యాయం నిర్ణయించటంలో చాలా సమర్థుడని పేరు. రామయ్య ఆయన వద్దకు వెళ్ళి, తనకు న్యాయం జరిగినదీ లేనిదీ తెలుసుకోవటానికి నిశ్చయించాడు.

న్యాయాధికారి రామయ్య చెప్పినదంతా వినటమే కాక, అతని జీవితం గురించి ప్రతి వివరమూ అడిగి తెలుసుకుని, "నీకు న్యాయం జరగకపోగా చాలా అన్యాయం జరిగింది. సోమిశెట్టినీ, అతని సాక్షులనూ రేపు న్యాయస్థానానికి పిలిపిస్తాను. రేపు నువు కూడా న్యాయస్థానానికి రా," అన్నాడు.

మర్నాడు అందరూ న్యాయస్థానానికి హాజరు అయారు. ఆయన మామూలు విచారణ అంతా జరిపి సోమిశెట్టితో, "రామయ్య ఆవు నీ పొలంలో పడి నీ పంట నాశనం చేసి, నీకు నష్టం కలిగించిన మాట నిజమే. కాని నీకు ఈ నష్టం కలగటానికి కారణం రామయ్య అజాగ్రత్త మాత్రం కాదు. నీ నష్టానికి నిజమైన కారణాలు రెండు కనిపిస్తున్నాయి. ఒకటి నువు రామయ్యకు అమ్మిన కట్టుతాడు. అది బలంగా లేదు. దాన్ని నువు రామయ్యకు రెట్టింపు ధరకు అమ్మి అక్రమ లాభం సంపాదించావు. నీ నష్టానికి రెండో కారణం నీ పొలానికి కంచె లేదు. కంచె లేని పొలంలోకి ఏ పశువు అయినా ప్రవేశించి, పంట నష్టం కలిగించవచ్చు. అందుచేత నీ నష్టానికి అన్ని విధాలా నువే బాధ్యుడివి. నువు రామయ్య వద్ద పుచ్చుకున్న ధరకు గట్టి తాడు ఇచ్చి ఉంటే ఆవు దాన్ని తెంపుకుని ఉండదు. నీ చేనుకు కంచె ఉంటే అది ఏ బీడులోనో మేసి ఉండేది, నీపంట పొలంలోకి వచ్చేది కాదు. నీ తప్పుకుగాను రామయ్య తన ఆవును నీకు అర్పించటం అక్రమం. ఆ ఆవును రామయ్యకు తిరిగి ఇచ్చెయ్యి," అన్నాడు.

రామయ్యకు ఎలాగైతేనేం న్యాయం జరిగింది.





# పరివర్తన

కొంతకాలం క్రిందట శ్రీపురం అనే గ్రామంలో రాఘవరాయులు అనే జమీందారు ఉండేవాడు. అతను గొప్ప దానశీలి. ఎవరైనా అపదలో ఉన్నారంటే వారికి తనకు చేతనైన సహాయం చేసేవాడు.

అ ఊళ్ళోనే బంగారుసెట్టి అనే లోభి ఉండేవాడు. అతను తన జన్మలో చిల్లిగవ్వ అయినా దానం చేసి ఎరగడు.

ఇలా ఉండగా ఒకసారి కాలంగాని కాలంలో తుఫాను వచ్చి చాలా ఇళ్లు పడిపోయాయి. పంటలు పాడయిపోయాయి. బీదజనం కరువువాత పడ్డారు. అది చూసి రాయులు బీద ప్రజలనందరినీ పిలిచి, తన వద్ద ఉన్న ధనమంతా వారికిచ్చి, పంచుకుని తినమని చెప్పాడు.

అయితే రాయులు ఇచ్చిన డబ్బు అందరికీ సరిపోలేదు. వాళ్లు రాయులును, "బాబూ, మీరిచ్చినది అందరికీ తినటానికి చాలదు. ఇంకా కొంత సహాయం చెయ్యండి." అని అడిగారు.

ఏం చెయ్యాలో తోచక రాయులు బయలుదేరి ఊళ్లోని ధనవంతుల వద్దకు వెళ్లాడు. అయన ఎవరిని దానం అడిగినా, "బంగారుసెట్టి మా అందరికన్నా ధనవంతుడు. ఆయన్ని అడగండి," అన్నారు.

రాయులు బంగారుసెట్టి వద్దకు వెళ్ళి, "సెట్టిగారూ, నాకు అవసరంగా అయిదు వేలు కావాలి. అయితే ఆ డబ్బుతోబాటు దాన్ని మీరు దానం చేస్తున్నట్టు నాకు ఒక చీటీ రాసి ఇయ్యండి. సాయంకాలానికి మీ డబ్బు తిరిగి ఇస్తాను," అన్నాడు.

బంగారుసెట్టికి ఇదేమీ అర్థం కాలేదు.

"సాయంకాలం వరకూ డబ్బు తీసుకుని ఏం చేస్తారు?" అన్నాడతను.

రాయులు చిరునవ్వు నవ్వి, "చూడండి, సెట్టిగారూ, మీరు ఎన్నడూ దాన ధర్మాలు

కే. బి. యస్. కుమార్

చెయ్యరని అందరూ ఎరుగుదురు. అలాటప్పుడు అయిదువేల రూపాయలు మీరు ధర్మం చేశారని తెలిస్తే, మిగిలిన వాళ్ళు మీతో పోటీపడి దానం చేస్తారు. జనం ఆకలితో అలమటిస్తున్నారు. సాయంకాలానికి మీ సొమ్ము మీకు తిరిగి ఇచ్చి, మిగతా వాళ్ళు ఇచ్చేది బీదప్రజలకు అందజేస్తాను. డబ్బు ఖర్చు కాకుండానే, సహాయం చేసిన పుణ్యం మీకు దక్కుతుంది,'' అన్నాడు.

'' అలాగే చెయ్యండి. సాయంకాలానికి నా సొమ్ము నాకిస్తారు గద ? '' అంటూ సెట్టి ఒక సంచీలో అయిదువేల రూపాయలు పోసి, తాను ఆ సొమ్ము దానం చేస్తున్నట్టు చీటీ రాసి, రాయలుకు అందించాడు.

ఆ చీటీ చూపి రాయలు సాయంకాలంలోపుగా ధనవంతులందరి దగ్గిరా విరివిగా దానాలు వసూలు చేసి, బీద ప్రజలకు అందించాడు. ఆ సాయంకాలం అతను సెట్టి ఇచ్చిన సంచీని అలాగే తీసుకుపోయి సెట్టికి ఇస్తూ, '' బంగారుసెట్టిగారూ, నేను అనుకున్నట్టుగానే మీ డబ్బు కారణంగా చాలా డబ్బు పోగయింది. పని జరిగిపోయింది. మీ సొమ్ము మీరు తీసుకోండి,'' అన్నాడు.

సెట్టి డబ్బు తీసుకోలేదు. రాయలుకు ఆశ్చర్యం వేసింది.

'' ఏమండీ, మీ డబ్బు తీసుకోరు ? '' అని ఆయన అడిగాడు.

'' రాయలుగారూ, నేను డబ్బు ఇచ్చినందుకు ఎంతమంది వచ్చి నన్ను ఎన్ని విధాల పొగడారనుకున్నారు ! అంత ఆనందం నా జన్మలో ఎన్నడూ ఎరగను. దానం చెయ్యటంలో గల ఆనందం చేసినవారికే తెలుస్తుంది. ఇకనుంచీ నేను కూడా మీ లాగే దానాలు చేస్తాను. ఇదుగో, మరో అయిదువేలు తీసుకుపోయి అనాథలకు దానం చెయ్యండి,'' అంటూ బంగారుసెట్టి రాయలుకు మళ్ళీ అయిదువేలు ఇచ్చాడు. బంగారుసెట్టిలో కలిగిన పరివర్తనకు రాయలు ఆశ్చర్యపోయాడు.






ఇతర వానరుల కన్న హనుమంతుడికే కార్యం సాధించే శక్తి, అవకాశమూ, ఎక్కువగా ఉన్నాయనుకుని సుగ్రీవుడు హనుమంతుడితో ఇలా అన్నాడు:

"మహావీరుడవైన హనుమంతుడా, నువు గాలిలోనూ, నీటిలోనూ, భూమి మీదా, పై అకాశంలోనూ కూడా సంచరించగలవాడివి. నీకు తెలియని లోకంగాని, సముద్రంగాని, పర్వతంగాని లేదు. నువు వాయుదేవుడిలాటి గమనమూ, వేగమూ కలవాడివి. భూమి మీద నిన్ను మించిన బలం గల ప్రాణిలేదు. అందుచేత సీతాదేవి తిరిగి దొరికే ప్రయత్నం నీ వల్లనే కావాలి. బలమూ, బుద్ధీ, దేశకాలానుగుణంగా ప్రవర్తించే నేర్పూ, పరాక్రమమూ నీలో ఉన్నట్టుగా మరెవరిలోనూ లేవు."

హనుమంతుడితో సుగ్రీవుడు ఇలా మాట్లాడటం విని రాముడు, కార్యభారాన్ని సుగ్రీవుడు హనుమంతుడి పైన పెట్టుతున్నట్టు గ్రహించాడు. హనుమంతుడి శక్తిసామర్థ్యాలు సుగ్రీవుడికి బాగా తెలిసి ఉండాలి. రాముడి ఆశలన్నీ హనుమంతుడి మీదికి మళ్ళాయి. అతను తన పేరుగల ఉంగరాన్ని హనుమంతుడికి ఇస్తూ, "వానర శ్రేష్ఠుడా, ఈ ఉంగరాన్ని చూసినట్టయితే సీతాదేవి నిన్ను చూసి భయపడదు, అనుమానించదు; నువు నా వద్ద నుంచి వచ్చావని గుర్తిస్తుంది. నీ వల్ల తప్పక పని జరుగుతుందని

8. స్వయంప్రభ కథ



సుగ్రీవుడి మాటలను బట్టి నాకు తోస్తున్నది." అన్నాడు.

హనుమంతుడు ఆ ఉంగరాన్ని తీసుకుని, నెత్తి మీద చేతులు పెట్టుకుని నమస్కారం చేసి, రాముడి పాదాలకు ప్రణామంచేసి, బయలుదేరాడు. అతనితో మరొకసారి రాముడు, "హనుమంతుడా, నేను నీ శక్తినే నమ్ముకుని ఉన్నాను. శక్తివంచన లేకుండా పాటుపడి, సీతాదేవి తిరిగి దొరికేటట్టు చూడు," అన్నాడు.

వానరులు మిడతల దండులాగా అన్ని దిక్కులకూ బయలుదేరారు. వాళ్ళు తిరిగి రావటానికి ఒక మాసం మాత్రమే గడువు వున్నది.

వానరులు బయలుదేరిన అనంతరం రామ, లక్ష్మణులు ప్రస్రవణపర్వతం మీది గుహలో వారు తిరిగి రావటం కోసం ఎదురుచూస్తూ ఉండిపోయారు.

వినతుడి బృందం తూర్పుగానూ, సుషేణుడి బృందం పడమరగానూ, మరి కొందరు ఉత్తరంగానూ వెళ్ళగా, హనుమంతుడూ, తారుడూ, అంగదుడూ మొదలైన వాళ్ళు దక్షిణదిక్కుగా బయలుదేరారు. అందరినీ అన్ని దిక్కులకూ పంపి, రాముడికి తాను ఇచ్చిన మాట నిలబెట్టుకున్న సంతృప్తితో సుగ్రీవుడు వెనకటి కన్నా మరింత సుఖంగా జీవించసాగాడు.

సుగ్రీవుడు పంపిన వానరులు సీతాదేవి కోసం చాలా శ్రద్ధగా వెతికారు. వారు ఎక్కడికి వెళ్ళినా పగలల్లా ప్రతి సరస్సూ, నదీ, పొదా, కొండా, గుహ వెతికి, రాత్రికాగానే ఒక చోటికి చేరుతూ, చెట్ల కింద రాత్రి గడుపుతూ ముందుకు సాగారు. తూర్పుగానూ, ఉత్తరంగానూ, పడమరగానూ వెళ్ళిన వానరబలగాల వాళ్ళు నెల గడువు తీరేసరికి తిరిగివచ్చి, సీతాదేవి జాడ తెలియలేదని సుగ్రీవుడితో చెప్పారు. అప్పుడు సుగ్రీవుడు ప్రస్రవణ పర్వతం మీద రాముడితో కూర్చుని ఉన్నాడు.

అయినా, ఇంకా ఆశ ఉన్నది. దక్షిణంగా వెళ్ళిన బృందం ఇంకా తిరిగి రాలేదు. సీతను తీసుకుపోయిన రావణుడు దక్షిణ దిక్కుగానే వెళ్లాడు. అందుచేత హనుమంతుడు సీతను చూసి వచ్చే అవకాశం ఉన్నది.

ఈ లోపుగా హనుమంతుడు మొదలైన వాళ్ళు సీత కోసం వెతుకుతూ వింధ్యపర్వత ప్రాంతాన్ని చేరుకున్నారు. అది చాలా విస్తృతమైన ప్రదేశం. అక్కడ ఎన్నో గుహలున్నాయి. శిఖరాలున్నాయి. అరణ్యాలున్నాయి. దాటటానికి కష్టమైన నదులున్నాయి. చాలా ఎత్తయిన చెట్లున్నాయి. పళ్లూ, దుంపలూ తింటూ వానరులు ఆ ప్రాంతంలో ఒక్కొక్క ప్రదేశమే సీతాదేవి కోసం వెతుకుతూ ముందుకు వెళ్ళారు.

ఒక ప్రదేశం బొత్తిగా శూన్యంగా ఉన్నది. అక్కడ చెట్లు నిలువునా ఎండి ఉన్నాయి. నదులలో నీరులేదు. లతలూ, పుష్పాలూ, దుంపలూ లేవు. ఎలాటి జంతువులు గాని, పక్షులు గాని లేవు. ఆ ప్రదేశం భయంకరంగా ఉన్నది.

ఆ వనంలో కండుమహర్షి ఉండేవాడు. ఆయనకు తపోబలం ఎంత ఎక్కువో, కోపం కూడా అంత ఎక్కువ. తన కొడుకు పదహారేళ్ళవాడు అకాలమరణం పొందే




సరికి, ఆయన ఆ వనాన్ని శపించి ఎడారిగా చేశాడు. వానరులు ఆ శూన్యప్రదేశంలో కూడా సీతాదేవి కోసం శ్రద్ధగా వెతికారు.

అలా వెతుకుతూ వాళ్ళు ఒక భయంకరమైన అరణ్యం గల ప్రదేశంలో ప్రవేశించారు. అక్కడ వాళ్లకు ఒక రాక్షసుడు కనిపించాడు. మహాకాయుడైన ఆ రాక్షసుణ్ణి చూస్తూనే వానరులు దట్టీలు బిగించి, వాడితో యుద్ధానికి సిద్ధపడ్డారు.

వాడు కూడా వానరులను చూస్తూనే, ''మిమ్మల్నందరినీ చంపేస్తాను,'' అంటూ పిడికిలి బిగించి వారి మీదికి వచ్చాడు. అంగదుడు వాణ్ణి చూసి, వాడే రావణుడు అయి ఉంటాడనుకుని, వాడి నెత్తి మీద



51



బలంగా కొట్టాడు. ఆ ఒక్క దెబ్బకే ఆ రాక్షసుడు నెత్తురు కక్కుతూ, నేల మీద పడిపోయి, ప్రాణాలు వదిలాడు.

రావణుడు చచ్చాడనీ, సీత వాడి గుహలోనే ఉంటుందనీ అనుకుని, వానరులు వాడి గుహ అంతా శ్రద్ధగా వెతికి చూశారు. అక్కడ సీత లేదు. వానరులు దాని సమీపంలో గల మరొక పెద్ద గుహ కూడా వెతికారు; ఆ అరణ్యమంతా వెతికారు. ఎక్కడా సీత కనిపించకపోయేసరికి, వాళ్ళు నిస్పృహ చెంది, ఒక చెట్టు కింద చేరి కూర్చున్నారు.

అప్పుడు అంగదుడు వాళ్ళతో, "మనం ఇంత కాలంగా ఎన్నో అరణ్యాలూ, నదులూ, పర్వతాలూ, గుహలూ ఎంతో శ్రమపడి వెతుకుతున్నా, మనకు సీత జాడగాని, ఆమెను ఎత్తుకుపోయిన రావణుడి జాడగాని తెలియరాలేదు. సుగ్రీవుడి ఆజ్ఞ మహా దారుణమైనది. మనం నిరుత్సాహపడి పని చెయ్యలేం. సోమరితనం పనికిరాదు. మరొకసారి ఈ వనం అంతటా వెతకండి. మీరంతా ఇప్పుడు నిద్రపోవటం భావ్యం కాదు. లేదా, ఇంకా మంచిపద్ధతి ఏమైనా ఉంటే చెప్పండి.'' అన్నాడు.

గంధమాదనుడు కూడా అంగదుడు చెప్పినట్టే చెప్పాడు.

అప్పుడు వానరులు తమ అలసటను మరిచిపోయి, తిరిగి వింధ్యపర్వతారణ్యాలలో సీత కోసం వెతకటం ఆరంభించారు. వాళ్ళు వెండి కొండలాటి ఒక శిఖరం ఎక్కి, అక్కడ కూడా సీతను చూడలేక పోయారు. తరవాత వాళ్ళు ఆ శిఖరం నుంచి దిగివచ్చి, కొంతసేపు విశ్రాంతి తీసుకుని, మళ్ళీ వెతకటం ప్రారంభించారు. వాళ్ళు వింధ్యపర్వతం మీద సీత కోసం వెతుకుతూ ఉండగానే సుగ్రీవుడు పెట్టిన నెల గడువు దాటిపోయింది.

వానరులు ఒక్కొక్క ప్రదేశాన్నే వెతుకుతూ వింధ్యపర్వతపు నైరృతి కొనకు చేరుకున్నారు. ఇక్కడికి చేరిన

వానరులలో ప్రముఖులు హనుమంతుడూ, గజుడూ, గవాక్షుడూ, గవయుడూ, శరభుడూ, గంధమాదనుడూ, మైందుడూ, ద్వివిదుడూ, సుషేణుడూ, జాంబవంతుడూ, నళుడూ, యువరాజు అంగదుడూ, తారుడూ ఉన్నారు.

వాళ్లు ప్రతి గుహలోనూ చూసుకుంటూ ఒక పెద్ద బిలం వద్దకు వచ్చారు. అది ఋక్షబిలం. దాన్ని మయుడు నిర్మించాడు. దానికి లతలు అడ్డంగా పెరిగి ఉంది. ప్రవేశించ రాకుండా ఉన్నది. వానరులు ఆకలి, దప్పులతో అలమటించి పోతున్నారు. ఆ ప్రాంతాల ఎక్కడా నీరు లేదు. వాళ్లు చాలా అలసిపోయి కూడా ఉన్నారు.

అయితే వాళ్లకు, ఋక్షబిలం నుంచి క్రౌంచపక్షులూ, హంసలూ, బెగ్గురు పక్షులూ, చక్రవాకాలూ మొదలైన నీటి పక్షులు బయటికి ఎగురుతూ రావటం కనిపించింది. అది చూసి హనుమంతుడు మొదలైన వాళ్ళు చాలా ఆశ్చర్యపడ్డారు. వాళ్లు ఆ బిలాన్ని సమీపించారు.

పర్వతాలను గురించీ, అరణ్యాలను గురించీ విశేషంగా తెలిసిన హనుమంతుడు మిగిలిన వారితో ఇలా అన్నాడు :

''చూడండి, ఈ గుహా ముఖం నుంచి నీటి పక్షులు ఎగురుతూ వస్తున్నాయి. దీని ద్వారంలో ఉన్న లతలూ, చెట్లూ సేవళంగా ఉన్నాయి. లోపల నీరు గల బావిగాని, చెరువుగాని ఉన్నదనటానికి





సందేహంలేదు. మనమూ, దాహంతో బాధ పడుతూ, చాలా డస్సి ఉన్నాం."

హనుమంతుడు ఈ మాట అనగానే వానరులు బిలంలోకి ప్రవేశించారు. లోపల కన్ను పొడుచుకున్నా కానరానంత చీకటిగా ఉన్నది. వానరులు తాము ఎటు పోతున్నదీ కూడా తెలియకుండా, తడువుకుంటూ ముందుకు పోయారు. పోగా, పోగా చీకటి పోయి, కాంతి వచ్చింది. తరవాత అమిత అందమైన ప్రదేశం వారికి కనబడింది. అక్కడ ప్రకాశవంతమైన కాంచనవృక్షాలూ, మద్దిచెట్లూ, తాటిచెట్లూ, సురపొన్న చెట్లూ, అశోక వృక్షాలూ, చంద్రచెట్లూ మొదలైనవి ఉన్నాయి. కొన్ని చెట్లూ, కాయలూ, పూలూ కాంతులు వెదజల్లుతున్నాయి. అక్కడ ఒక తామరకొలనులో బంగారు తామరలూ, బంగారు చేపలూ, బంగారు తాబేళ్ళూ ఉన్నాయి.

ఆ ప్రదేశంలో గొప్ప ఇళ్ళు కూడా ఉన్నాయి. వాటి కిటికీలు బంగారువి; కప్పులు బంగారంతోనూ, వెండితోనూ చేసినవి. ఆ ఇళ్లలో ముత్యాల తోరణాలు కట్టి వున్నాయి: మణులు అలంకరించి ఉన్నాయి.

ఆ ప్రదేశంలో వానరులకు పగడపు కాంతిగల చెట్ల మీద పూలూ, పళ్ళూ కనిపించాయి; రకరకాల మద్యాలు కనిపించాయి; రత్నాలు తాపిన బంగారు కుర్చీలూ, మంచాలూ, వాహనాలూ కనిపించాయి. అక్కడక్కడ బంగారు, వెండి, కంచుపాత్రలు రాసులు రాసులుగా ఉన్నాయి. అలాగే అగరూ, చందనమూ, పళ్లూ, దుంపలూ, పానీయాలూ, తేనే, వస్త్రాలూ, కంబళాలూ, రకరకాల చర్మాలూ, బంగారమూ కుప్పలు కుప్పలుగా కనిపించాయి.

వానరులు ఆ ప్రదేశమంతా వెతుకుతూ ఒకచోట ఒక స్త్రీని చూశారు. ఆమె జింకచర్మం కట్టుకుని, తపస్సు చేసుకుంటున్నది. ఆమె వెలిగిపోతున్నది.

అది చూసి వానరులు ఆశ్చర్యమూ, భయమూ కలిగి ఆగిపోయారు.

హనుమంతుడు ఆమెను, "నువు ఎవరు? ఈ బిలం ఎవరిది?" అని అడిగాడు, చేతులు జోడించి ఆమెకు నమస్కారం చేస్తూ. అతను ఇంకా ఇలా అన్నాడు:

"మేం మార్గాయసంతో అలసిపోయి, ఆకలి దప్పులతో బాధపడుతూ, ఇక్కడ నీరూ, తిండీ దొరుకుతాయన్న నమ్మకంతో, చీకటి కొణంలాగా ఉన్న ఈ బిలంలో ప్రవేశించాం. కాని ఇక్కడ ఉండే ఈ అద్భుతమైన వస్తువులన్నీ చూస్తే ఇదేదో రాక్షసమాయలాగా కనబడుతున్నది. ఈ బంగారు చెట్లూ, ఈ బంగారు, వెండి, ఇళ్లూ ఎవరివి? ఈ కొలనులో ఉన్న బంగారు తామరలను ఎవరు సృష్టించారు? బంగారు తాబేళ్లూ, బంగారు చేపలూ ఎవరి కల్పన? మాకు ఇదంతా అయోమయంగా ఉన్నది. మాకు కాస్త తెలియ జెప్పు."

హనుమంతుడికి ఆ తపస్విని ఇలా సమాధానం చెప్పింది:

"మయుడు అనే గొప్ప దానవుడు ఇక్కడ ఉండేవాడు. అతను దానవుల విశ్వకర్మ. అతని మాయాబలం వల్ల ఈ బంగారు వృక్షాల వనం ఏర్పడింది. అతను గొప్ప తపస్సు చేసి, సమస్తమైన ధనమూ బ్రహ్మ నుంచి వరంగా పుచ్చుకున్నాడు. అతను హేమ అనే అప్సరతో



ఈ ప్రదేశంలో సుఖంగా ఉంటూండగా ఇంద్రుడు అలిగి, మయుణ్ణి వజ్రాయుధంతో కొట్టాడు. తరవాత బ్రహ్మ ఈ ప్రదేశాన్ని హేమకు ఇచ్చాడు. నేను మేరుసావర్ని కుమార్తెను. నా పేరు స్వయంప్రభ. హేమకు చెందిన ఈ ప్రదేశాన్ని రక్షిస్తూ, నేను ఇక్కడ ఉంటున్నాను. హేమ నా స్నేహితురాలు. ఆమె సంగీత, నృత్యాలలో సమర్థురాలు. ఆమె నాకిచ్చిన వరం మూలాన నన్ను ఎవరూ జయించలేరు. మీరు ఏ కారణంచేత ఈ ప్రాంతాల తిరుగుతున్నారు? ప్రవేశించటానికి సాధ్యం కాని ఈ ప్రదేశానికి ఎందుకు వచ్చారు? మీరు ముందు పళ్ళు తిని, నీరు తాగి, మీ వృత్తాంతం నాకు సవిస్తరంగా చెప్పండి.''

హనుమంతుడు ఏమీ దాచకుండా స్వయంప్రభకు జరిగినదంతా వివరంగా చెప్పాడు. చివరకు అతను ఆమెతో, '' అమ్మా, నువు మాకు తిండి పెట్టి మా ప్రాణాలు నిలబెట్టావు. ఇందుకు మేం ఏం ప్రత్యుపకారం చెయ్యగలమో చెప్పు.'' అన్నాడు.

'' చాలా సంతోషం! నాకు మీ నుంచి ప్రత్యుపకారం ఏమీ అవసరం లేదు.'' అన్నది స్వయంప్రభ.

'' అమ్మా, ఇప్పటికే మాకు సుగ్రీవుడు ఇచ్చిన గడువు దాటింది. ఈ బిలం నుంచి మేము శీఘ్రంగా బయట పడేటట్టు చూడు. మమ్మల్ని కాపాడు. మేం ఇక్కడ చిక్కుకుపోతే, సీతను వెతికే పని నిలిచిపోతుంది.'' అన్నాడు హనుమంతుడు.

దానికి స్వయంప్రభ, '' నేను నా తపశ్శక్తితో మిమ్మల్ని బయటికి పంపిస్తాను. మీరందరూ కళ్ళుమూసుకోండి.'' అన్నది.

వానరులందరూ వేళ్లతో కళ్ళు మూసుకుని, మరుక్షణమే బిలం వెలపల ఉన్నారు! అప్పుడు వారి వెంట ఉన్న స్వయంప్రభ వారితో, '' ఇది వింధ్య పర్వతం. అది సముద్రం. మీకందరికీ శుభం కలుగుగాక!'' అని తిరిగి వెళ్ళిపోయింది.






సత్త్వా, భిజనసంపన్న,
స్సానుక్రోశో, జితేంద్రియః,
కృతజ్ఞ, స్సత్యవాదీ చ,
రాజా లోకే మహీయతే. 1

[బలవంతుడూ, మంచి కులంలో పుట్టిన వాడూ, ఆర్తులంటే దయగలవాడూ, ఇంద్రియాలను జయించిన వాడూ, నిజం చెప్పేవాడూ అయిన రాజును లోకం మెచ్చుకుంటుంది.]

యస్తు రాజా స్థితో ధర్మే
మిత్రాణా ముపకారిణాం
మిథ్యా ప్రతిజ్ఞాం కురుతే
కో నృశంసతర స్తతః. 2

[అధర్మపరుడై, తనకు ఉపకారం చేసినవారికి అసత్యప్రమాణాలు చేసే రాజు మహా పాపిష్ఠి వాడు.]

అమిత్రాణాం వధే యుక్తో,
మిత్రాణాం సంగ్రహే రతః
త్రివర్గఫల భుక్తాతు
రాజా ధర్మేణ యుజ్యతే. 3

[శత్రువులను చంపుతూ, మిత్రులను పెంపొందించుకుంటూ, ధర్మార్థకామాలను అనుభవించే రాజు రాజధర్మం చక్కగా నెరవేర్చుతాడు.]

రాజధర్మం



59

Photo by Prasad



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఒంటె కేం తెలుసు

పంపినవారు :
కే. పి. లత

Photo by Bishan Maheshwari



కొత్తూర్ వీధి,
హన్మకొండ.

గాడిద బరువు

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







* వ్యాఖ్యలు మే 20 వ తేదీలోగా చేరాలి. వ్యాఖ్యలు పోస్టుకార్డు పైన మాత్రమే రాయాలి.
* వ్యాఖ్యలు ఒక్కమాటలో గాని, చిన్న వాక్యంలో గాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు జూలై నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట:
అమ్మకం

మూడవ అట్ట:
ఆరగింపు


Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3. Arcot Road, Madras-600026. Controlling Editor : 'CHAKRAPANI'

## సరిగ్గా ఆడాడు...

























ఫోర్‌హాన్స్

దంతవైద్యునిచే సృష్టించబడిన టూత్ పేస్ట్





# సమయోచిత సందర్భాన్ని చెప్పండి రూ 50,000 లు విలువచేసే బహుమతులు గెలవండి

## ప్యారీవారి "సమయోచిత సందర్భాన్ని చెప్పండి" పోటీలో

**2** మొదటి బహుమానాలు — మీ ఇష్టమువచ్చిన ఆభరణాలసమితి ఒక్కొక్కటి — విలువ రూ. **10,000/-.**

**2** రెండవ బహుమానాలు_రెఫ్రిజిరేటరుగాని వంట సరంజామాగాని ఒక్కొక్కటి — విలువ రూ: **5,000/-**

**50** కన్‌సోలేషన్ బహుమానాలు — కాంచీపురము చీరలు ఒక్కొక్కటి — విలువ రూ. **400/-.**

మీకు దగ్గరలోనున్న డీలరువద్ద పూర్తి వివరములతోగల ఎంట్రీ ఫారములు లభిస్తాయి.







6 రంగులలో లభిస్తాయి గ్రా 450లు
ధర రూ 12/-లు మాత్రమే.

ప్యారీస్
కన్‌ఫెక్షనరీ లిమిటెడ్
మద్రాసు.

**త్వరపడండి!**
**పోటీ ముగింపు తేది 15 జూన్ 1975**

SAA/PRS/1665



